Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్ రైతు

సంపుటి: 83 • సంచిక: 4 • 25-1-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# తేలిపోయిన తెలంగాణ బూచి!

అదిగో పులి అన్నట్లు టీవీ ఛానళ్లన్నీ కలిసి ఇల్లెక్కి గోల చేసిన తెలంగాణ బూచి గాలి కబురు మాత్రమే అని తేలిపోయింది. గత నెల జరిగిన అఖిలపక్ష సమావేశంలో నెల రోజుల లోపల ఏదో ఒకటి తేల్చేస్తామని కేంద్ర హోంమంత్రి సుశీల్ కుమార్ షిండే చెప్పడంతో, తెలంగాణ వచ్చేస్తున్నదనే ప్రచారం చేశారు. జైపూర్ చింతన్ బైఠ్ సమావేశంలో ఒక నిర్ణయం వెలువడుతుందని గట్టిగా నమ్మారు. కానీ జైపూర్ సమావేశం రాహుల్‌గాంధీ పట్టాభిషేకానికి పరిమితమైంది. ఆ రోజు నుంచి కాంగ్రెస్ పగ్గాలు రాహుల్ చేతికి చిక్కాయి. ఆయనకు అంతా కొత్త. దేశ సమగ్రత, భద్రత, శాంతి భద్రతల ప్రమాదం వంటి మౌలిక అంశాలతో ముడిపడి వున్న తెలంగాణపై రాత్రికి రాత్రి నిర్ణయం తీసుకొనేంత పరిణితి లేనివాడు కాదు రాహుల్‌గాంధీ. ఈ విషయమై కాంగ్రెస్ అగ్రనాయకత్వంలోనే ఏకాభిప్రాయం లేదు. ముఖ్యంగా ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్, మొన్నటి వరకు పార్టీ విధాన నిర్ణేతగా మెలిగిన ప్రణబ్ ముఖర్జీ రాష్ట్ర విభజనకు విముఖులు. ప్రధానికి రెండు భయాలున్నాయి. మొదటిది – బోడోల్యాండ్, గూర్ఖాల్యాండ్ ఉద్యమాలు. బోడోల్యాండ్‌లో తెలంగాణ కంటే తీవ్రంగా హింసాయుత ఉద్యమం నడుస్తున్నది. ఇవి రెండూ సరిహద్దు రాష్ట్రాలు. ఏ మాత్రం పొరపాటు చేసినా దేశ భద్రతకు ముప్పు. రెండవ కారణం – మావోయిస్టుల ఉధృతి. చత్తీస్‌ఘడ్, జార్ఖండ్‌లలో రాష్ట్ర విభజన తర్వాత మావోయిస్టులు విజృంభించడం నడుస్తున్న చరిత్ర. తెలంగాణలోను అదే జరుగుతుందని ప్రధాని భయం. ప్రణబ్ అభ్యంతరాలలో ముఖ్యమైనది – చిన్న రాష్ట్రాల ఏర్పాటు వల్ల కొత్త రాజధానుల నిర్మా

కొరవ 14వ పేజీలో

## వివేకాకిక విశ్రాంతేనా?



విఆర్ కాలేజీ కమిటీ అధ్యక్షుడిగా ఆర్థికమంత్రి ఆనం రామనారాయణ రెడ్డి రాజీనామా చేశారు. ఆయన స్థానంలో తన తమ్ముడు ఆనం విజయ కుమార్‌రెడ్డిని నియమించాడు. తాత్కాలిక సెక్రటరీ, కరస్పాండెంట్ బాధ్యతలు కోశాధికారి ఎన్.శ్రీనివాసులురెడ్డికి అప్ప చెప్పారు. ఈ మార్పులకు కారణం – రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి అనారోగ్యం. ఆయన ఆరోగ్యం కుదుట పడడానికి మరి కొంత సమయం పట్టవచ్చునని తెలుస్తున్నది. దానితో ఆయన దీర్ఘకాలిక విశ్రాంతికి సిద్ధపడినట్లు లెక్క. వేణుగోపాలస్వామి కాలేజీ కరస్పాండెంట్ బాధ్యతలు కూడా తుమ్మల సుబ్బారెడ్డికి అప్ప చెప్పారు.

విఆర్ కాలేజీ ఆనం వారి కుటుంబ ఆస్తి కాదు. ఆ కాలేజీ స్థాపనలో వారి పాత్ర, ప్రమేయం శూన్యం. కానీ అడిగేవారు లేరనే ధీమాతో దాన్ని తమ కుటుంబ ఆస్తిగా పరిగణిస్తున్నారు. చలామణి అవుతున్నారు. ఇప్పుడు ఏకంగా వారసత్వ బదలీకి పూనుకొన్నారు. వివేకా ఇప్పుడు ఆరోగ్య సమస్యతో ఇబ్బంది పడుతున్నాడు.

కొరవ 14వ పేజీలో

# సంచలన తీర్పు!

హర్యానా మాజీ ముఖ్యమంత్రి ఓం ప్రకాష్ చౌతాలాకు సిబిఐ ప్రత్యేక కోర్టు పదేళ్ల కఠిన కారాగారవాస శిక్ష విధించింది. ఆ రాష్ట్రంలో జరిగిన ఉపాధ్యాయ నియామక కుంభకోణంలో ముఖ్యమంత్రిగా చౌతాల పాత్రను నిర్ధారించింది న్యాయస్థానం. ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలో పని చేసేందుకు 12వేల మంది ఉపాధ్యాయులను నియమించే సమయంలో జరిగింది ఈ కుంభకోణం. ఒక్కొక్కరి దగ్గర నుంచి 3 లక్షల రూపాయల వరకు లంచం తీసుకొని నియామకాలు జరిపారన్నది అభియోగం. అందుకోసం వ్రాత పరీక్షలో ప్రతిభావంతులుగా నెగ్గిన వారిని ప్రక్కన పెట్టి, తమకు లంచం ఇచ్చిన వారికి ఇంటర్వ్యూలో 17 మార్కులు అదనంగా కలిపారు అధికారులు. దీనితో అనర్హులు ఉద్యోగాలు పొందారు. అర్హులైన వారు అన్యాయమైపోయారు. అప్పట్లో ఈ కుంభకోణం హర్యానాలో తీవ్ర సంచలనం సృష్టించింది. ఈ కేసులో ఓం ప్రకాష్ చౌతాలాతోపాటు ఆయన కుమారుడు అజయ్ చౌతాలా, ఇద్దరు సీనియర్ ఐఎఎస్ అధికారులతో సహా మొత్తం 55 మంది దోషులుగా తేలారు. అందరికీ వారి వారి పాత్రను బట్టి శిక్షలు పడ్డాయి. అవినీతి ఆరోపణల కేసులో రాజకీయవాదులు, ఉన్నతాధికారులు ఇంతటి కఠిన శిక్ష ఎదుర్కోవడం మన దేశంలో ఇదే ప్రథమం. హిమాచల్ ప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి సుఖరామ్‌కు విధించిన ఐదేళ్ల కారాగారవాస శిక్ష ఒక్కటే ఇప్పటివరకు అత్యంత పెద్దది. ఆయనకు ఐదేళ్ల జైలు శిక్ష పడింది. తమిళనాడు ముఖ్యమంత్రి జయలలితకు ఏడాదిపాటు శిక్ష పడింది.

అవినీతి కుంభకోణాల విషయంలో మంత్రులు, ముఖ్యమంత్రులను విచారించడానికి ప్రభుత్వ అనుమతి అవసరం లేదని హైదరాబాద్ సిబిఐ కోర్టు ప్రకటించిన సమయంలోనే ఢిల్లీ సిబిఐ కోర్టు ఈ తీర్పు వెలువరించడం యాధృచ్ఛికమే అయినా దేశంలోని రాజకీయవాదులందరికీ వెన్నులో చలి పుట్టించే పరిణామం. ఇప్పటి వరకు మంత్రులు, ఐఎఎస్ అధికారులు చాలా ధీమాతో వుండేవారు. తమ మీద ఎవరు కేసు పెట్టినా ఏమీ చేయలేరనే ధీమా వల్లనే మన దేశంలో రాజకీయ వ్యవస్థ అవినీతితో కుళ్లి కంపు కొట్టే స్థితికి దిగజారిపోయింది. తాము చట్టానికి అతీతులమని, తమ మీద న్యాయ స్థానాలలో నేరం రుజువు చేయడానికి చట్టాలు సహకరించవని, ఆధారాలు నిలవవనే అభిప్రాయం రాజకీయవాదులలో, ఐఎఎస్ అధికారులలో పుష్కలంగా వుంది. చౌతాలా కేసుతో ఆ భ్రమలు తొలగిపోయాయి.

చౌతాలా సాధారణ రాజకీయవాది కాదు. ఐదు సార్లు తన స్వరాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఎన్నికైనవాడు. ఆయన తండ్రి దేవీలాల్ వెనుకటి తరంలో అత్యంత ప్రజాదరణ కల్గిన నేత. దేశ ఉపప్రధానిగా రైతుల రుణాలను ఒక్క కలం పోటుతో రద్దు చేసి, సంచలనం సృష్టించిన ధీరోధాత్తుడు. అంతటి ప్రాచుర్యం కల్గిన కుటుంబం నుంచి వచ్చి కూడా 78ఏళ్ల ముదుసలి వయస్సులో జైలుకు వెళ్తున్నాడు చౌతాలా. తనకు ఆరోగ్యం బాగాలేదని, పక్షవాతం వల్ల కాలు చెయ్యి పని చేయడం లేదని మొర పెట్టుకొన్నా న్యాయస్థానం మనసు మార్చుకోలేదు. ఈ తీర్పు ప్రభావం దేశం మొత్తం మీద వుండబోతుంది. పలు రాష్ట్రాలలో సిబిఐ ప్రత్యేక న్యాయస్థానాలు చాలా మంది రాజకీయవాదుల మీద విచారణలు జరుపుతున్నాయి. ములాయం సింగ్ యాదవ్, మాయావతి, వైఎస్.జగన్, కనిమొళి, ఎ.రాజా వంటి పలుకుబడి కల్గిన నేతలు ఈ కేసులలో ఇరుక్కొని వున్నారు. కేసుల పాటికి కేసులు, నేతల పాటికి నేతలు అన్న ధోరణిలో నడుస్తున్నది ఇప్పటి వరకు. న్యాయస్థానాలు విచారణకు దశాబ్దాల తరబడి సమయం తీసుకోవడం వల్ల జరుగుతున్న అనర్థం ఇది. దానితో రాజకీయవాదులను ఏ కేసులు, ఏ కోర్టులూ ఏమీ చేయలేవన్న ధీమా ప్రబలిపోతున్నది సమాజంలో. ఆ నిరాశాపూరిత వాతావరణంలో ఢిల్లీ సిబిఐ కోర్టు ఒక ఆశాకిరణం వలె కన్పిస్తున్నది. ఈ స్ఫూర్తితో అయినా సిబిఐ ప్రత్యేక న్యాయస్థానాలన్నీ తమ దగ్గరున్న రాజకీయవాదుల అవినీతి సంబంధిత కేసులను సత్వరం పరిష్కరించే పోకడ అవలంభిస్తే న్యాయానికి, చట్టానికీ ఎవరూ అతీతులు కారన్న విశ్వాసం ప్రజలలో స్థిరపడుతుంది. ఆ రోజు కోసం ఎదురు చూద్దాం.

జమీన్‌రైతు

## జనవాణి

### ఆత్మ రక్షణకు ఆయుధాలు!

దేశంలో మహిళలపై మానభంగాలు పెరిగి పోతున్నాయి. ప్రజలకు జీవించే హక్కుంది. ఆత్మ రక్షణ చేసుకునే హక్కుంది. అందువల్ల లైసెన్స్ విధానం రద్దుచేసి ప్రతి మహిళకు తుపాకీ కొనుక్కునే హక్కు కల్పించాలి. మానభంగాలకు పాల్పడే వారికి భయం భక్తి రావాలంటే ఇస్లామిక్ షరియా ప్రకారం శిక్షించాలి. లేకుంటే శ్రీకృష్ణదేవరాయలు హయాంలోలా కళ్లు పొడిచేయడం లాంటి శిక్షలు విధించాలి. అవి కుదరకుంటే మన పోలీసులకు అలవాటైన ఎన్‌కౌంటర్లకు గ్రీన్‌సిగ్నల్ ఇవ్వాలి.

పి.అరుణకుమారి — నెల్లూరు

### కఠిన శిక్షలు అవసరం!

ఢిల్లీలో అత్యాచారానికి గురై మృత్యువుతో పోరాడి ఓడిపోయిన సోదరి జ్యోతి మరణానికి యావద్భారతం కన్నీరు కార్చింది. ఈ దారుణానికి పాల్పడిన వారికి ఉరిశిక్ష ఖాయమని విశ్వసిస్తున్నాము. అయితే ఈ నరరూప రాక్షసులు ఒక్కసారి చావకూడదు. ఈ యువతి అనుభవించిన నరకయాతనను వారు అనుభవించాలి. ముందు వాళ్ల కాళ్లు, చేతులు నరికి తీహార్ జైల్లో పదేళ్లు ఉంచాలి. కొన్నాళ్లు వారిని బహిరంగంగా జనంతో రాళ్లతో కొట్టించాలి. ఏదిఏమైనా మన దేశంలో నేరాలకు కఠిన శిక్షలు లేకే అరాచకాలు ఎక్కువైపోయాయి.

కె.హేమ — నెల్లూరు

### సామాన్యులెలా బతకాలి?

దేశంలో 80 శాతం మందికి పైగా ప్రజలు వంటకు గ్యాస్ సిలిండర్లనే వినియోగిస్తున్నారు. సామాన్య, మధ్యతరగతి వారు సైతం నిత్యం సిలిండర్‌తోనే తమ ఆహారం వండి వడ్డించడం సర్వసాధారణమయ్యింది. ఆ తర్వాత జీవనోపాధి కోసం మహిళలు పరుగులు తీస్తారు. తిరిగి వచ్చిన తర్వాత మళ్లీ గ్యాస్ పైనే వంటావార్పు చేసి, వేడినీళ్లు కాచుకొని స్నానమాచరించి విశ్రమిస్తారు. ఈ జీవిత క్రమంలో కుటుంబానికి ఆరు సిలిండర్లు ఏడాదికి ఇస్తామన్న షరతు సడలించాలి. నెలకో సిలిండర్ ఇచ్చే ఏర్పాటు చేయాలి. రాయితీలేని సిలిండర్ ధర వెయ్యి రూపాయలు. సామాన్య, మధ్యతరగతీయులు ఈ రేటుకు సిలిండర్ను కొనగలరా? నిత్యావసర వస్తువులు, బియ్యం ధరలకు తోడుగా విద్యుత్ ఛార్జీల రేట్లు పెరిగిన నేపథ్యం గ్యాస్ సిలిండర్ వినియోగం ఇబ్బందిగా మారితే బతుకులెట్లా మనగలవు.

ఆర్.రుక్మిణి — నెల్లూరు

### ఆర్ట్స్ అండ్ సైన్స్ కళాశాలలపై దృష్టి!

గతంలో డివిజన్ కేంద్రానికో ఆర్ట్స్ మరియు సైన్సు డిగ్రీ కాలేజీలుండేవి.

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

29-1-1943
పేజీలు : 8 వెల: 0-1-6

### స్వాతంత్ర్య దినోత్సవం అరెస్టులు!

నెల్లూరు విఆర్ కాలేజిలో ప్రిన్సిపాల్ పవిత్రమైన విదేశీ వస్త్రాలతో జాతీయ పతాకను ప్రతిష్టిస్తే యం.ఏ గుర్రం సుబ్బరామయ్య గారు ఖద్దరు ధారణలో వుపన్యసించారు.

విద్యార్థులేమో సమ్మెచేసి యిండ్లకు వెళ్లారు. ట్రంకురోడ్డు మీద హోటళ్లు, దుకాణాలు మూసివేసి హర్తాళ్ చేసిరి.

వెంకటగిరిలో కాంగ్రెస్ వారు జండా చౌకువద్ద జాతీయ పతాకాన్ని నెలకొల్పిరి. పోలీసు దాన్ని లాగి పెరికి పారవేయబోగా పొట్టి ముత్యాలు గారి సుబ్బరామయ్య, పంట శంకరదాసు గార్లు అడ్డగించగా పోలీసు బలవంతంగా పీకివేసి వారిద్దరినీ అరెస్ట్ చేశారు.

తరువాత పతాక రక్షణలో ఒక్కొక్కరుగా 8 మంది అరెస్ట్ గావింపబడ్డారు. అందులో 5 ఫారం విద్యార్థి పి.వి.చలమయ్య, పొట్టి ముత్యాలు గారి జగ్గయ్యలను మరు రోజు వదిలిరి. కావేటి రామతిలకమ్మను అరెస్ట్‌చేసి స్వంత పూచి మీద వదిలిరి. చీళ్ల గుర్నాధం గారి 12 ఏళ్ల కుమారైను కూడా అరెస్ట్‌చేసి అప్పుడే వదిలిరి. కమ్యూనిస్టులు ఉత్సవంలోని కాంగ్రెస్ జాతీయ పతాకాలను, ఎర్ర జెండాలను పోలీసు పీక్కొని రామనాధం వగైరాలను అరెస్ట్‌చేసి వదిలిరి.

26వ తేది కావలిలో హర్తాళ్ జరిగింది. హిందీ అధ్యాపకులు నరహరి గారు, సయ్యద్ ఖాసిం, లెక్కల తిమ్మారెడ్డి, తన్నీరు కొండయ్య గారలు బజారులో స్వాతంత్ర్య ప్రమాణ పత్రం చదువుతున్నప్పుడు వారిని అరెస్ట్‌చేసి రాత్రి 8 గంటలకు వదిలిరి.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

25-1-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### సస్యలక్ష్మి చిన్నచూపు

ఈ సంవత్సరం నెల్లూరు మండలం ముఖ్యంగా నెల్లూరు, కోవూరు డెల్టాల రైతాంగం పట్ల సస్యలక్ష్మి చిన్నచూపు చూసింది. గత సంవత్సరం పంటలో ఈ సంవత్సరం సరాసరి సగం పంట గూడా ఉండదనిపిస్తున్నది.

డెల్టాలో ముదురు అదునులో వేసిన మొలగొలుకు మొదట బాగుండినది. కానీ వెన్ను తీసి పంట వచ్చే సరికి పూర్తిగా తేలిపోయింది. ఎకరాకు రెండు పుట్లు కాగలదనుకొన్నది పుట్టెడు కూడా కావడం లేదు. ఇక మామూలు భూములలో ఎంత అధ్వాన్నంగా ఉండగలదో వూహించండి.

లేత అదునులో వేసినది అక్టోబరులో ఇరవై రోజులపాటు విడుదల లేకుండా కుమ్మరించబడిన వర్షాల వల్ల కొంత; నవంబరు 29వ తేది తుఫానుకు మరికొంత; కొరవ సరవ తెగుళ్ల వల్ల నాశనమైంది పోను మిగిలిన నాలుగు కర్రలు మాత్రం గట్టిగా పండినదిగానీ, అది లెక్కలోకి తీసుకోదగింది కాదు.

ఈ సంవత్సరం తెగుళ్లు విపరీతంగా వ్యాపించాయి. ఇది ఒక్క డెల్టాలోనే గాదు, తడ మొదలు తాళ్లూరు వరకు ఇదే పరిస్థితి. తెగుళ్ల నివారణకు ఎన్ని లక్షల గాలన్ల ఎండ్రిన్ ఖర్చయి ఉంటుందో; ఎన్ని టన్నుల గమాక్సిన్ వ్యయమై ఉంటుందో చెప్పలేము. నెల్లూరు జిల్లా వ్యవసాయశాఖ ఆధ్వర్యాన ఉన్న స్ప్రేయర్లు చాలక, బయట జిల్లాల నుంచి 200 తెప్పించబడినవి. ఇవిగాక రైతుల వద్ద ఎన్నో ఉండినవి. పైరుకు మందు జల్లడం ఒక్కసారి గాదు, ఒక్కొక్కరు రెండు మూడు సార్లు గూడా చల్లవలసి వచ్చింది. ఈ సంవత్సరం తెగుళ్ల మీద ఎండ్రిన్‌గానీ, గమాక్సిన్‌గానీ పూర్తిగా పనిచేయలేదు. అసలు రసాయనిక ఎరువులు గూడా మామూలుగా ఇచ్చే గుణాన్ని యివ్వలేదు.

# నెల్లూరు ముచ్చట్లు

## తెలుగుదేశం ఆఫీసు వద్ద సందడి!

నెల్లూరు మినీ బైపాసు రోడ్డులోని తెలుగుదేశం పార్టీ ఆఫీసు వద్ద ఈ మధ్య సందడి సందడిగా ఉంది. పార్టీ పొలిట్ బ్యూరోలో చంద్రమోహన్‌రెడ్డికి స్థానం లభించడం, తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షునిగా ఎన్నికైన బీద రవిచంద్ర కార్య కర్తల కోసం ఆఫీసులో అందుబాటులో ఉండడం వల్ల నిత్యం ఇక్కడ సందడి నెలకొని ఉంది.

## సమైక్యాంధ్ర వైపే పనబాక మొగ్గు!

సమైక్యాంధ్ర వైపే తాను మొగ్గు చూపుతానని కేంద్ర పెట్రోలియం శాఖా మంత్రి పనబాక లక్ష్మి స్పష్టం చేశారు. ఇటీవల నెల్లూరు వచ్చిన ఆమె విలేకరులతో మాట్లాడుతూ ఆంధ్రప్రదేశ్‌ను ముక్కలు చేయడం తనకు ఇష్టంలేదని తేల్చి చెప్పారు.

## సమైక్యవాదినే... కానీ!

వ్యక్తిగతంగా తాను సమైక్యవాదిననే ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి స్పష్టం చేశారు. అయితే తెలంగాణ విషయమై కాంగ్రెస్ పార్టీ అధిష్టాన వర్గం ఏ నిర్ణయం తీసుకొన్నా తాను దానికి బద్ధుడై ఉంటానని చెప్పుకొచ్చారాయన.

## సాగునీటిపై కలెక్టర్‌ను కలసిన బీద బ్రదర్స్!

జిల్లాలో అప్పుడే సాగునీటి కష్టాలు మొదలయ్యాయి. అల్లూరు, బోగోలు, దగదర్తి, కావలి మండలాల్లో ఇటీవలే నారు వేత పూర్తయ్యి ఎదుగుతున్న పంటకు నీటి సరఫరా లేకపోవడంతో ఎండిపోవడం మొదలెట్టింది. బోగోలు మండలంలోని ముంగమూరు రైతులైతే పంటను కాపాడుకొను ట్యాంకర్ల ద్వారా నీటిని తెచ్చి పోస్తున్నారు. ఇదే విషయాన్ని 22వ తేది కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు, జిల్లా తెలుగుదేశం పార్టీ అధ్యక్షుడు బీద రవిచంద్ర కలెక్టర్ శ్రీధర్‌రెడ్డిని బంగ్లాలో కలసి వివరించారు. ఈ విషయమై కలెక్టర్ గారు ఓ కార్యాచరణ రూపొందించక పోతే పోను పోను జిల్లాలో సాగునీటి కష్టాలు తీవ్రరూపం దాల్చి రైతులు తిరగబడే పరిస్థితులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. సాగునీటి శాఖాధికారులు తస్మాత్ జాగ్రత్తగా ఉండాల్సిన రోజులివి.

## రైల్వే ట్రాక్ గోడ వెంబడి చెత్త!

నెల్లూరు రంగనాయకులపేట నుంచి వేదాయపాళెం వరకు రైల్వే ట్రాక్ వెంబడి గోడకట్టి తమ స్థలాలను రక్షించుకొనే ప్రయత్నం రైల్వే శాఖ చేస్తుంది. ఈ గోడ నగరంలోని చెత్తాచెదారం పోసే వాళ్లకు రక్షణ కవచంగా మారింది. విజయమహల్ గేటు నుంచి ఆర్టీసి వరకు ఈ గోడ ప్రక్కన టన్నుల కొద్దీ చెత్తాచెదారం పేరుకపోయి ఉంది. నగరంలో ప్రతినిత్యం పడుతున్న చెత్తను ఎత్తను నానాపాట్లు పడుతున్న కార్పొరేషన్ ఈ అదనపు చెత్తను ఎప్పటికి ఎత్తుతుందనేది సమాధానం దొరకని ప్రశ్నగా మారింది.

## సెప్టెంబర్‌లో థర్మల్ విద్యుత్ ఉత్పత్తి!

నేలటూరులోని దామోదరం సంజీవయ్య థర్మల్ విద్యుత్ కేంద్రంలో ఈ యేడాది సెప్టెంబర్‌లో తొలి యూనిట్‌లో విద్యుత్ ఉత్పత్తి ఆరంభమవుతుందని జెన్‌కో ఎమ్డీ, నెల్లూరు అల్లుడు విజయానంద్ చెప్పారు. 18వ తేది నెల్లూరు వచ్చిన ఆయన మాట్లాడుతూ తొలి విడతగా 800 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి చేస్తామని, 2014 నాటికి రెండో యూనిట్ ప్రారంభించి మరో 800 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తిని అందుబాటులో ఉంచుతామన్నారు.

## అదనపు లోడు బాదుడు!

విద్యుత్ ఛార్జీలు, సర్‌ఛార్జీల బాదుడు చాలదన్నట్లు ఆ శాఖ వినియోగదారులు వినియోగించే విద్యుత్ లోడుపై అదనపు ఛార్జీల విధింపుతో మరో దోపిడీకి తెరలేపింది. కిలో వాట్ వినియోగించేవారు 1,225 రూపాయలు ప్రత్యేక డిపాజిట్‌గా చెల్లించాలి. ఇదిగాక డెవలప్‌మెంట్ ఛార్జీలు వెయ్యి రూపాయలు, సెక్యూరిటీ డిపాజిట్‌గా మరో రెండు వందలు, రిజిస్ట్రేషన్ ఫీజుగా 25 రూపాయలు చెల్లించాలని కొత్త బిల్లులు జారీ చేస్తున్నారు. ట్రాన్స్‌కో విధిస్తున్న రకరకాల ఛార్జీలు పూర్వం ఔరంగజేబు పాలనలోని పిచ్చి పిచ్చి పన్నులను గుర్తు చేస్తున్నాయి. ప్రజల జేబులను ఈ విధంగా ఖాళీ చేయడం ట్రాన్స్‌కోకు తగనుగాక తగదు.

## సోమిరెడ్డికి స్వాగతం

తెలుగుదేశం పార్టీ పొలిట్‌బ్యూరో సభ్యునిగా నియమితుడయ్యాక తొలిసారిగా నెల్లూరు వచ్చిన సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డికి ఘన స్వాగతం లభించింది. బెంగుళూరు నుంచి రోడ్డు మార్గాన జిల్లాకు వచ్చిన ఆయనకు నాయుడుపేట నుంచి నెల్లూరు వరకు పార్టీ కార్యకర్తలు తమ శక్తిమేర స్వాగతం పలికారు. నెల్లూరు నగరంలో అయితే అయ్యప్పగుడి నుంచి మినీబైపాస్ రోడ్డులోని ఆ పార్టీ ఆఫీసు వరకు తెలుగుదేశం పార్టీ కార్యకర్తలు మోటారు సైకిళ్ల ర్యాలీ నడుమ సోమిరెడ్డిని తోడ్కొని వచ్చారు. పార్టీ జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర, సూళ్లూరుపేట ఎమ్మెల్యే పరసా రత్నం, వేనాటి రామచంద్రారెడ్డి, కిలారి వెంకటస్వామి నాయుడు, కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## కెవిఆర్ స్మారకోపన్యాసం!

విప్లవ రచయితల సంఘం స్థాపకుల్లో ఒకడైన నెల్లూరీయుడు కెవి రమణారెడ్డి స్మారకోపన్యాసాన్ని 27వ తేది సాయంత్రం టౌన్‌హాల్‌లో కెవిఆర్, శారదాంబ స్మారక కమిటీ నేతృత్వంలో జరుగుతుంది. విరసంకు చెందిన సియస్ఆర్ ప్రసాద్ ఈ సభకు అధ్యక్షత వహిస్తారు. ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం నేత ఎస్.శేషయ్య ప్రపంచీకరణ – భారత రాజ్యాంగం ఎదుర్కొంటున్న సవాళ్లు అనే అంశంపై మాట్లాడుతారు. కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–1 పుస్తకాన్ని రాచపాళెం చంద్రశేఖర్‌రెడ్డి ఆవిష్కరిస్తారు. కెవిఆర్ అభిమానులను ఈ కార్యక్రమానికి తరలి రమ్మంటున్నారు నిర్వాహకులు.



కనుపర్తిపాడులో హైస్కూల్ పిల్లలకు కిట్స్ బ్యాగ్ పంపిణీ చేస్తున్న పారిశ్రామికవేత్త వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి.

## డాక్టర్ జగదీష్‌కు అంతర్జాతీయ గుర్తింపు!

నెల్లూరులోని నాయుడమ్మ సెంటర్ ఫర్ డెవలప్‌మెంట్ ఆల్టర్నేటివ్స్ సంస్థ డైరక్టర్, కవరైపేటలోని ఆర్ఎంకె ఇంజనీరింగ్ కాలేజిలో ప్రొఫెసర్ డాక్టర్ ఎ.జగదీష్ ఆస్ట్రేలియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హై ఎనర్జిటిక్ మెటీరియల్స్ ప్రచురించే రీసెర్చ్ బులెటిన్‌కు డిప్యూటీ ఎడిటర్ – ఇన్–ఛీఫ్‌గా నియమితులయ్యారు. ఇప్పటికే డాక్టర్ జగదీష్ ఈ ఇన్‌స్టిట్యూట్‌కు వైస్ ఛాన్సలర్‌గా వ్యవహరిస్తున్నారు.

## అరుణమ్మ హర్షం

రాహుల్‌గాంధీని కాంగ్రెస్ పార్టీ ఉపాధ్యక్షులుగా నియమించడం పట్ల జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు పందిళ్లపల్లి అరుణమ్మ హర్షం వ్యక్తం చేశారు. రాహుల్ గాంధీ నేతృత్వంలో 2014లో జరిగే పార్లమెంటు ఎన్నికల్లో పార్టీ విజయం సాధించగలదన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశారు.

## స్కూల్ పిల్లలకు వేమిరెడ్డి కిట్స్!

అనాథలు, అన్నార్తులు, అభాగ్యులను ఆదుకోవడంలో కలిగే సంతృప్తి మరెందులోనూ ఉండదని, వారికి చేయూతనందిస్తే జన్మ చరితార్థమైనట్లేనని పారిశ్రామికవేత్త వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి అభిప్రాయపడ్డారు. స్లీపింగ్ చిల్డ్రన్ అరౌండ్ ద వరల్డ్ కార్యక్రమంలో భాగంగా కనుపర్తిపాడు జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలోని 225 మంది పిల్లలకు వారికి అవసరమైన వస్తువులతో కూడిన కిట్స్ అందించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ నేటి బాలలే రేపటి పౌరులన్న నానుడిని పరిగణనలోనికి తీసుకొని గత నాలుగేళ్లుగా ఈ కార్యక్రమాన్ని కొనసాగిస్తున్నట్లు చెప్పారు. ఈ కార్యక్రమంలో కనుపర్తిపాడు మాజీ సర్పంచ్ వెందోటి చంద్రశేఖర్‌రెడ్డి, కెనడా దేశస్తులు, విద్యార్థుల తల్లితండ్రులు పాల్గొన్నారు.

## రంగమయూర్ ర్యాలీ!

కాంగ్రెస్ పార్టీ ఉపాధ్యక్షునిగా

కొరవ 14వ పేజీలో



రిజిస్ట్రార్ ఆఫీస్‌లో లంచాల జమానా.

• పెళ్లి రిజిస్ట్రేషన్‌కు

## లంచంగా 1500 రూపాయలు!

### రిజిస్ట్రార్ ఆఫీసులో అవినీతి జమానా!

కుక్కతోక వంకర తీయడం, రిజిస్ట్రేషన్ శాఖలో లంచాలు లేకుండా పని చేయడం పొరపాటున కూడా జరగదని చెప్పొచ్చు. జనం నుంచి లంచాలు పబ్లిక్‌గా తీసుకొనే శాఖల్లో రిజిస్ట్రేషన్ శాఖది ఎప్పుడూ ముందు వరసే. నెల్లూరులో పాడుపడిపోయిన కార్యాలయంలో అది పని సాగిస్తున్నా సాయంత్రానికి ఇక్కడ పనిచేసే అధికారులకు, సిబ్బందికి దమాషా ప్రకారం స్టాంప్ వెండర్లు లక్షలాది రూపాయలు లంచాలు ఇళ్లకు తీసుకెళ్లి ఇవ్వడం రివాజే. నెల్లూరు రిజిస్ట్రార్ ఆఫీసులో పెళ్లిళ్లు కూడా రిజిస్ట్రేషన్ చేస్తారు. నామమాత్రపు ఫీజుకు ఈ పని చేయాలి. దీనికి అవసరమైన అప్లికేషన్, పెళ్లి ఫోటోలు, పుట్టిన తేదీ సర్టిఫికేట్లు, నివాస ధృవీకరణ పత్రాలు పెళ్లి చేసుకొన్న వాళ్లు అందిస్తే చాలు. ప్రేమ పెళ్లిళ్లు, పెద్దలను ఎదిరించి పెళ్లి చేసుకునే వారి వద్ద ఈ రిజిస్ట్రేషన్‌కు డబ్బులు కూడా ఉండవు. కానీ రిజిస్ట్రేషన్ కార్యాలయంలో పెళ్లి రిజిస్ట్రేషన్‌కు 1500 రూపాయలు లంచంగా తీసుకొంటున్నారు. పెళ్లి చేసుకునే అమ్మాయికి ఒక భరోసా ఇస్తూ చట్టపరంగా భవిష్యత్తులో ఉపయోగపడను ఈ రిజిస్ట్రేషన్ అవసరం. దీన్ని సాకుగా చేసుకొని ఈ తంతుకు లంచం డిమాండ్ చేయడం, దాన్ని తీసుకొంటూనే ఈ సీటులోని ఉద్యోగి మహా ఫోజు చూపడం దారుణం. నెల్లూరు రిజిస్ట్రార్ సీటులో ఓ మహిళ కూర్చొని పనిచేస్తూ కూడా ఈ లంచాల జమానా కొనసాగించడం బాధాకరం. రిజిస్ట్రేషన్ కార్యాలయంలోని సిబ్బంది పెళ్లిళ్ల రిజిస్ట్రేషన్ వ్యవహారంలోనైనా కాస్త మానవతా దృక్పథంతో స్పందించాల్సిన అవసరం లేదంటారా?

## తెలుగుదేశంతోనే రాష్ట్రాభివృద్ధి!

### ఎన్టీఆర్ వర్ధంతి సభలో బీద రవిచంద్ర



వర్ధంతి సందర్భంగా ఎన్టీఆర్ విగ్రహానికి నివాళులర్పిస్తున్న తెలుగు తమ్ముళ్లు.

దివంగత వైఎస్‌రాజశేఖర్‌రెడ్డి, కిరణ్‌కుమార్‌రెడ్డిల పాలనలో రాష్ట్రం సర్వనాశనమయ్యిందని, రాష్ట్రంలో పూర్వ పరిస్థితులు ఒక్క చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రి అయితేనే సాధ్యమని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర స్పష్టం చేశారు. మాజీ ముఖ్యమంత్రి ఎన్టీ రామారావు 17వ వర్ధంతి సందర్భంగా రమేష్‌రెడ్డి ఆధ్వర్యంలో నర్తకి సెంటర్‌లో ఏర్పాటుచేసిన సభలో రవిచంద్ర ముఖ్యఅతిథిగా విచ్చేసి మాట్లాడారు. స్వర్గీయ ఎన్టీ రామారావు రాష్ట్రంలో తెలుగుదేశం పార్టీని స్థాపించే సమయంలో ఏ సమస్యలైతే ఉన్నాయో ప్రస్తుతం అదే పరిస్థితులు రాష్ట్రంలో నెలకొని ఉన్నాయన్నారు. ఫలితంగా ప్రజలు ఒక్క పూట కూడా తిండి తినలేక అల్లాడుతున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. ప్రజల సమస్యలను చూసి ఎన్టీఆర్ తెలుగుదేశం పార్టీని స్థాపించి పలు సంక్షేమ పథకాలు ప్రవేశపెట్టి అటు ప్రజలను, ఇటు రాష్ట్రాన్ని అభివృద్ధి పథంలోనికి తీసుకెళ్లారన్నారు. నేడు వైఎస్ రాజశేఖర్‌రెడ్డి అవినీతి వల్ల, కిరణ్‌కుమార్‌రెడ్డి దోపిడీ వల్ల అభివృద్ధి విషయంలో చిన్న రాష్ట్రాలకంటే ఆంధ్రప్రదేశ్ వెనక్కి పోయిందన్నారు. నిత్యావసర వస్తువులు, పెట్రోల్, డీజిల్, గ్యాస్, విద్యుత్ ఛార్జీల ధరలు పెరిగి ప్రజలు అల్లాడి పోతున్నారన్నారు. మాజీ మంత్రి రమేష్‌రెడ్డి మాట్లాడుతూ ఇటు సినిమాల్లోనూ, అటు రాజకీయాల్లోనూ ఎన్టీఆర్ సూపర్‌స్టార్‌గా వెలుగొందిన వైనాన్ని వివరించారు. కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి, అంచల వాణి, ధర్మవరపు సుబ్బారావు, లలితారామ్, దయాకర్‌గౌడ్, మండవ రామయ్య, నూనె మల్లిఖార్జునయాదవ్, శింగంశెట్టి మురళీమోహన్‌రావు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.



వర్క్‌షాపులో మాట్లాడుతున్న జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి.

• అనాథ బాలలకు

## పోలీసు చేయూత అభినందనీయం!

### బాలల హక్కుల వర్క్‌షాపులో కలెక్టర్

అనాథ బాలలు, వీధి బాలలు, బాల కార్మికులను గుర్తించి వారిని సన్మార్గంలో నడిపించేందుకు వసతి భోజన సౌకర్యాలు కల్పించి, విద్యాభివృద్ధికి కృషి చేస్తున్న పోలీసు శాఖ సేవలు అభినందనీయమని జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డి ప్రశంసించారు. 18వ తేది పోలీస్ పెరేడ్ గ్రౌండ్స్‌లోని ఉమేష్ చంద్ర కాన్ఫరెన్స్ హాలులో బాలల హక్కులు, వారి సంరక్షణలపై జరిగిన వర్క్ షాపులో కలెక్టర్ ముఖ్య అతిథిగా పాల్గొని మాట్లాడారు. విధివంచితులైన అనాథ బాలలను గుర్తించి వారి సంరక్షణకు, సమాజంలో మంచి పౌరులుగా తీర్చిదిద్దేందుకు అధికారులందరూ సమిష్టిగా కృషి చేయాలన్నారు. ప్రస్తుతం సమాజంలో కుటుంబాలలోని తల్లితండ్రులు పిల్లల మధ్య సంబంధాలు దెబ్బతిని పోతున్నాయని ఆవేదన వ్యక్తం చేశారు. ఇటువంటి పరిస్థితులలో పిల్లలు టీవీలు చూస్తూ, సెల్‌ఫోన్ సంభాషణలు చేస్తూ ప్రక్కదారిన పడే అవకాశముందన్నారు. ఎస్పీ బి.వి.రమణకుమార్ మాట్లాడుతూ అనాథ బాలలు, నిరాదరణకు గురైన పిల్లల కోసం తమ శాఖ ఆధ్వర్యంలో క్యాప్ సంస్థ ద్వారా అందిస్తున్న సేవలను వివరించారు. యునిసెఫ్ ప్రోగ్రాం ఆఫీసర్ ఎం.మురళీకృష్ణ, సాంఘిక సంక్షేమ శాఖ డిప్యూటీ డైరక్టర్ విశ్వమోహన్‌రెడ్డి, ఐసిడిఎస్ పిడి కె.విజయలక్ష్మి, ఎఎస్పీలు ఎల్.టి.చంద్రశేఖర్, ఏ.సి. నాగేశ్వరరావు, పలువురు డిఎస్పీలు, పలు స్వచ్ఛంద సంస్థలకు చెందిన ప్రతినిధులు పాల్గొన్నారు.

## ప్రక్కదారి పడుతున్న విత్తనాలు

### రాయితీ విత్తనాలు మరి

రైతులను ఆదుకొనేందుకు ప్రభుత్వం రాయితీపై విత్తనాలు అందజేస్తున్నప్పటికీ అధికారుల అవినీతి కారణంగా అవి రైతుల దరి చేరడం లేదు. ఫలితంగా అటు ప్రకృతి సహకరించక, ఇటు వ్యవసాయ శాఖ అధికారులు ఆదుకోక అన్నిరకాలుగా అన్నదాత నష్టపోతున్నాడు. వర్షాభావ పరిస్థితుల కారణంగా సాగునీరు అందక వరిసాగు చేపట్టిన రైతులు తీవ్రంగా దెబ్బతింటున్నారు. ఈ పరిస్థితుల్లో రైతులు ఆరుతడి పంటలు సాగు చేసేలా వారిని ప్రోత్సహించేందుకు రాయితీపై విత్తనాలు అందిస్తోంది ప్రభుత్వం. ఇక్కడే కొందరు సిబ్బంది చేతివాటం ప్రదర్శించి రైతుల నోరుకొట్టి జేబులు నింపుకొంటున్నారు. రాయితీపై సరఫరా చేసిన విత్తనాలను రైతులకు అందజేయకుండానే ఇచ్చినట్లు తప్పుడు లెక్కలు వ్రాసి పెద్ద ఎత్తున దిగమింగినట్లు సమాచారం. విత్తనాలను రైతులకు పంపిణీ చేసేందుకుగాను 50 శాతం వ్యవసాయ శాఖ భరించి, మరో 50 శాతం రైతుల నుంచి వసూలు చేయాల్సి ఉంది. వివిధ సంస్థల నుంచి విత్తనాలను కొనుగోలు చేయకుండానే వందల క్వింటాళ్లు కొనుగోలు చేసినట్లు రికార్డుల్లో నమోదు చేసి భారీగా అవకతవకలకు పాల్పడినట్లు తెలుస్తోంది. మినుము, జీనుగ, కంది, పెసర, శనగ, వేరశనగ, పొద్దుతిరుగుడు, జొన్న విత్తనాలు రాయితీపై అందిస్తారు. విత్తనాలను రైతులకు అందించకుండానే అక్రమాలకు పాల్పడ్డారు. రబీ సీజన్‌లో ఏడు వేల క్వింటాళ్ల విత్తనం పంపిణీ చేయాలన్నది లక్ష్యంకాగా ఇప్పటివరకు నామమాత్రంగా సరఫరా చేసి రికార్డుల్లో మాత్రం పెద్ద ఎత్తున విత్తనాలు పంపిణీ చేసినట్లు చూపించి లక్షల రూపాయలు దిగమింగుతున్నారట. దీనిపై ఉన్నతాధికారులు విచారణ జరిపితే విత్తనాల పంపిణీలో జరిగిన అవకతవకలు బయటపడతాయి.

## విద్యార్థులకు పరీక్షా సమయం!

ప్రైవేట్ పాఠశాలలకు ధీటుగా విద్యాబోధన జరగాలని, అందుకు తగినట్లు ప్రభుత్వ పాఠశాలల్లో మౌలిక వసతులు కల్పిస్తున్నామని ప్రజాప్రతినిధులు, అధికారులు ప్రకటిస్తున్నా ఆచరణలో మాత్రం అందుకు విరుద్ధం ఉంటోంది. పబ్లిక్ పరీక్షల సమయం ముంచుకొస్తున్నా జిల్లాలోని పలు పాఠశాలల్లో పాఠ్యాంశాల బోధన పూర్తికాలేదు. దీంతో విద్యార్థులు తీవ్ర ఆందోళన చెందుతున్నారు. సబ్జెక్టు టీచర్ల కొరత, మరోవైపు పాఠ్యపుస్తకాలు విద్యాసంవత్సరం ముగుస్తున్నా విద్యార్థులందరికీ అందకపోవడంతో ఆ ప్రభావం విద్యార్థులపై పడుతోంది. గత కొన్నేళ్లుగా ప్రభుత్వ పాఠశాలల్లో చదివే విద్యార్థులు ఈ సమస్యలనే ఎదుర్కొంటున్నారు. అధికారులు మాత్రం ప్రభుత్వ పాఠశాలలను బలోపేతం చేస్తున్నాం, ప్రైవేట్ పాఠశాలల విద్యార్థులకు ఏమాత్రం తీసిపోని రీతిలో ఉత్తీర్ణత సాధించేలా తగినచర్యలు చేపడుతున్నామని చెబుతున్నప్పటికీ విద్యార్థులకు మాత్రం ప్రతి ఏడాది పరీక్షలకు ముందు ఈ విషమ పరీక్షలను ఎదుర్కొంటూనే ఉన్నారు. అరకొర సౌకర్యాల నడుమ తమ ప్రతిభను చూపి ఎలాగోలా నెగ్గుకు రావడమే తప్ప విద్యాశాఖ పరంగా, ప్రభుత్వ పరంగా విద్యార్థులకు అందుతున్న సహకారం మాత్రం ఏమీలేదని

### పూర్తికాని సిలబస్

చెప్పాలి. ఆర్భాటపు ప్రకటనలు, మొక్కుబడి కార్యక్రమాలు నిర్వహించి చేతులు దులుపు కోవడం తప్ప విద్యార్థులకు చక్కని విద్యను, మంచి బోధనను అందించి వారిని ఉన్నతులుగా తీర్చిదిద్దాలన్న లక్ష్యం అధికారులు, ఉపాధ్యాయుల్లో కొరవడడంతో ప్రభుత్వ పాఠశాలల్లో చదివే వారు తీవ్ర ఇబ్బందుల నడుమ చదువుకోవాల్సి వస్తోంది. ఎవరైనా విద్యార్థులు తమ స్వయంకృషితో మంచి మార్కులు తెచ్చుకుంటే అది తమ కృషి ఫలితమేనని చెప్పుకోవడం తప్ప చేస్తున్నది ఏమీలేదనే విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.

## ప్రహసనంగా పోలియో చుక్కలు!

జిల్లాలో మూడు రోజులపాటు నిర్వహించిన పల్స్‌పోలియో కార్యక్రమంలో సిబ్బంది నిర్లక్ష్యంగా వ్యవహరించినట్లుగా కనిపిస్తుంది. జిల్లావ్యాప్తంగా మూడు లక్షల 45 వేల 968 మంది 0–5 సంవత్సరాలలోపు పిల్లలున్నట్లు వైద్య, ఆరోగ్య శాఖాధికారులు గుర్తించారు. వీరందరికీ ఈ నెల 20, 21, 22 తేదీలలో పోలియో చుక్కలు తప్పనిసరిగా వేయాలని నిర్ణయించి ఆ దిశగా ముందస్తు ఏర్పాట్లు చేస్తున్నట్లు ప్రకటించడం జరిగింది. నగరం, పట్టణ ప్రాంతాల్లో మొబైల్ వాహనాలను ఏర్పాటు పెద్దగా కనిపించ లేదు అంతే గాకుండా వలస ప్రాంతాల్లో పనిచేస్తున్న కూలీల వద్దకు నేరుగా వైద్య సిబ్బంది వెళ్లి చిన్న పిల్లలకు పోలియో చుక్కలు వేయలేక పోయారు. పోలియో చుక్కల కార్యక్రమాన్ని పర్యవేక్షించేందుకు నియమించిన అధికారులు కొన్ని ప్రాంతాల్లో మధ్యాహ్నం తర్వాత పత్తా లేకుండా పోయారు. ఇతర రాష్ట్రాలు, జిల్లాల నుంచి వలస వచ్చి ఇటుక బట్టీలు, చెరకు కటింగ్ చేస్తున్న వారు నివాసాలు ఏర్పాటు చేసుకున్న చోట ఈ కార్యక్రమం జరగలేదు.

## ● రామనారాయణరెడ్డి దక్షతకు సవాలుగా

# సహకార సంఘాల ఎన్నికలు!

సహకార సంఘాల ఎన్నికల ప్రక్రియ మొదలైంది. జిల్లాలోని 99 ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘాలకు కార్యవర్గం ఎన్నికతో ఈ ప్రక్రియ మొదలౌతుంది. రెండవ దశలో జిల్లాస్థాయి కోఆపరేటివ్ బ్యాంక్ అధ్యక్షుడిని ఎన్నుకొంటారు. గతంలో ఈ పదవిని వాకాటి నారాయణ రెడ్డి దక్కించుకొన్నాడు. అయితే ఆయన ఆ తర్వాత శాసనమండలి సభ్యుడిగా గెలవడంతో, బ్యాంక్ పదవికి రాజీనామా చేశాడు. ఆ స్థానంలో తాత్కాలిక ప్రాతిపదికన వేమారెడ్డి శ్యామసుందర రెడ్డి కొనసాగుతున్నాడు. పోయినసారి కోఆపరేటివ్ బ్యాంక్ ఎన్నికలు జరిగినప్పుడు జిల్లాలో కాంగ్రెస్ పార్టీ పటిష్టంగా వుంది. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా వున్నాడు. నేదురుమల్లి జనార్ధన రెడ్డి చురుకుగా వ్యవహరించేవాడు. దానితో ఇతర పార్టీలకు అవకాశమే దొరకని పరిస్థితి. ఇప్పుడు రోజులు మారిపోయాయి. వైఎస్ ఈ లోకంలోనే లేడు. ఆరోగ్య సమస్యలతో నేదురుమల్లి జనార్ధనరెడ్డి రాజకీయాలకు దూరమైపోయాడు. ఆయన తర్వాత ఆ స్థాయిలో జిల్లాలో రాజకీయ పెత్తనం చేసే ఆనం కుటుంబం కూడా, వివేకానందరెడ్డి అనారోగ్యం వల్ల బలహీనపడిపోయి వుంది. కాంగ్రెస్‌కు పెద్ద దిక్కు అంటూ ఎవరూ లేరు. పేరుకు ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి వున్నా, ఎన్నికల రాజకీయాలకు ఆయన ఎంత మాత్రం సరితూగడు. ఆ నేర్పు లేదు, ఆ ఓపికా లేదు.

కొత్తగా వచ్చిన వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ పురిటిలోనే సంధి తగిలిన దాని వలె వుంది. ఆ పార్టీకి నేనే జిల్లా పెద్దను అని చెప్పుకొంటున్న మేకపాటి రాజమోహన్‌రెడ్డి గారికి సహకార వ్యవస్థతో కనీసపాటి సంపర్కం లేదు. దాని లోతుపాతులు తెలియవు. పైగా ఆ పార్టీలో ఏ ఇద్దరు నాయకుల మధ్యా సయోధ్య లేదు. తమలో తాము కుమ్ములాడుకోవడానికే వున్న సమయం చాలడం లేదు వారికి. అప్పటికీ ఒకరిద్దరు డబ్బులున్న మారాజులు పోటీకి సిద్ధపడి ముందుకు వచ్చారట. కానీ రాజమోహన్ రెడ్డికి నచ్చిన ముఖం కాకాణి గోవర్ధన్ రెడ్డికి నచ్చలేదు. ఈయనకు నచ్చితే ఆయనకు ఒప్పలేదు. ఈ కోడెల మధ్య తమ కాళ్లెక్కడ విరిగిపోతాయోనని భయపడి రాజకీయ ఉబలాటం వున్న లేగదూడలు పారిపోయాయి.

తెలుగుదేశం పరిస్థితి చాలా బలహీనంగా వుంది. పదేళ్ల నుంచి ప్రతిపక్షంలో వుండడం వల్ల ఆ పార్టీ నేతలందరూ ఆర్థికంగా చితికిపోయి వున్నారు. ఎన్ని ఎన్నికలకని ఇంట్లో నుంచి సొమ్ము తెచ్చి ఖర్చు పెట్టగలరు? సహకార ఎన్నికల ప్రక్రియను ఔపోసన పట్టిన రాజకీయ అగస్త్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి కూడా ఏమీ చేయలేని పరిస్థితి. కోఆపరేటివ్ బ్యాంక్ ఎన్నిక అంటే, ఇప్పటి వాతావరణంలో కనీసం మూడు నాలుగు కోట్ల రూపాయల ఖర్చు పెట్టుకోవాలి. ఆ స్థోమత కల్గిన వారు తెలుగుదేశం పార్టీలో ఎవరూ కన్పించడం లేదు.

అయితే విచిత్రంగా గ్రామ స్థాయిలో మాత్రం తెలుగుదేశం పార్టీ



పొలిట్ బ్యూరో సభ్యునిగా బాధ్యతలు చేపట్టి నెల్లూరుకు విచ్చేసిన సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డికి స్వాగతం పలుకుతున్న బీద రవిచంద్ర, ఒట్టూరు సంపత్‌రాజు, సూళ్లూరుపేట శాసనసభ్యుడు పరసా రత్నం, నూనె మల్లికార్జున యాదవ్.

చాలా బలీయంగా కన్పిస్తున్నది. దాదాపు అన్ని సహకార సంఘాలలో కాంగ్రెస్‌కు ధీటుగా పోటీ ఇవ్వగలుగుతున్నారు వారు. ఏ మాత్రం ఏమరుపాటుగా వున్నా కోఆపరేటివ్ బ్యాంక్‌ను పచ్చ చొక్కాల దళం తన్నుకపోయే ప్రమాదం కన్పించడంతో ఆనం రామనారాయణరెడ్డి ఉలిక్కిపడి మెలకువ తెచ్చుకొన్నాడు. ఆయనకు రాజకీయ నేర్పరితనం లేకపోయినా, అధికారంలో వున్నాడు కాబట్టి వనరుల కొరత లేదు. డబ్బున్న మారాజులు చాలా మందే ఆయన చుట్టూ మూగే వున్నారు. తానొక్కడే గోదాలో నెగ్గలేనన్న నిజం తెలిసినవాడు కాబట్టి, భేషజం పక్కనపెట్టి, అందరి ఇళ్లకూ వెళ్లాడు రామనారాయణరెడ్డి. ఆదాల ప్రభాకర్ రెడ్డి, నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ, అల్లూరు విష్ణువర్ధన్‌రెడ్డి, వాకాటి నారాయణరెడ్డి వంటి వారందరితోనూ సంప్ర

కొరవ 14వ పేజీలో



# చట్టం మారిస్తేనే ఉరి శిక్ష!

ఢిల్లీ నగరంలో యువతి మానభంగం దుర్ఘటన జాతి మొత్తాన్ని కలచి వేసింది. లక్షలాది మంది యువతీ యువకులు నిరసన తెలపడానికి వీధులలోకి వచ్చే అరుదైన పౌర స్పందన సృష్టించింది. ఇంతటి స్వచ్ఛంద ప్రజా చైతన్యం ఆశ్చర్యం కల్గించే పరిణామం. దాని ధాటికి కేంద్ర ప్రభుత్వమే గడ గడ వణికింది. ఈ యువలోకం కోరుకొంటున్నది – మానభంగం నేరానికి పాల్పడే ముష్కరులకు ఉరి శిక్ష విధించాలని వారి కోరిక న్యాయమైనది, కోరదగినది కూడా.

పి.వి.రమణారెడ్డి
సీనియర్ న్యాయవాది, నెల్లూరు.

నేరానికి నిర్వచనం, దానికి శిక్ష నిర్ణయం భారతీయ శిక్షా స్మృతిని అనుసరించి జరుగుతుంది. అందులో ఉరి శిక్ష అనేది హత్యా నేరాలకు మాత్రమే అనుమతించారు. అది కూడా అత్యంత అరుదైన నేర సంఘటనలలో మాత్రమే ఈ అంతిమ శిక్ష విధింపు జరగాలని నిర్దేశించారు. అసలు ఏ నేరానికైనా ఉరి శిక్ష అనేది సముచితమా అన్న చర్చ ప్రపంచస్థాయిలో నడుస్తున్నదిప్పుడు. చాలా దేశాలు ఉరి శిక్షను రద్దు చేశాయి కూడా. కానీ మన యువలోకం మాత్రం ఉరి శిక్షను కోరుకొంటున్నది.

అయితే ఢిల్లీ యువతిని దారుణాతి దారుణంగా చెరిచి, శరీరాన్ని ఛిద్రం చేసి, ఆమె చావుకు కారకులైన నిందితులకు వారి నేరం రుజువైనప్పటికీ ఉరి శిక్ష విధించే అవకాశం న్యాయస్థానాలకు లభించదన్నది నిజం. మన శిక్షా స్మృతి ప్రకారం మానభంగానికి ఉరి శిక్ష వేయడానికి లేదు. 7 సంవత్సరాల నుంచి జీవిత ఖైదు వరకు శిక్షా విధించే అవకాశం మాత్రమే వుంది. చట్టాలకు భిన్నంగా తీర్పు చెప్పే అధికారం సర్వోన్నత న్యాయస్థానానికి కూడా లేదు. ఢిల్లీ నర రూప రాక్షసులకు ఉరి శిక్ష విధించాలంటే అందుకు అనుగుణంగా భారతీయ శిక్షాస్మృతిని సవరించడం ఒక్కటే మార్గం. మనది ప్రజాతంత్ర వ్యవస్థ. చట్ట సమ్మతము, నియమ బద్ధము అయిన వ్యవస్థలో వున్నాము మనము. మన శిక్షా స్మృతిని బ్రిటీష్ పాలకులు 1860 సంవత్సరంలో రూపొందించారు. ఈ 150 ఏళ్లుగా దానినే న్యాయస్థానాలు పాటిస్తూ వస్తున్నాయి. అయితే అప్పటికీ ఇప్పటికీ సమాజం ఎంతో మారిపోయింది. నేర స్వభావం, నేరాలు జరిగే తీరు మారిపోయాయి. ప్రజల దృక్పథంలో, వారి ఆలోచనా తీరులో ఎన్నో మార్పులు చోటు చేసుకొన్నాయి. వాటికి అనుగుణంగా శిక్షా స్మృతిని సైతం మార్పు చేసుకోవడం ఏ కోణం నుంచి చూసినా సముచితం అవుతుందే తప్ప అభ్యంతరం చెప్పవలసిన అవసరం లేదు. శిక్షాస్మృతిలో మానభంగాన్ని, దానికి శిక్షను నిర్వచించిన 375 అధికారాన్ని మార్పు చేసి, ఉరి శిక్షను జత చేస్తే ప్రజల ఆకాంక్షను నెరవేర్చినట్లు అవుతుంది. అందుకు భారత ప్రభుత్వం తగిన చర్యలు చేపట్టడం సమంజసం.



ఎన్టీఆర్ వర్ధంతి సందర్భంగా నెల్లూరు కామాటివీధిలో జరిగిన సభలో నివాళులర్పిస్తున్న బీద రవిచంద్ర, కిలారి వెంకటస్వామినాయుడు, ధర్మవరపు సుబ్బారావు.

# స్వర్ణభారత్‌లో సంక్రాంతి శోభ!

## ముఖ్య అతిథిగా కర్నాటక ఉప ముఖ్యమంత్రి

సంస్కృతా సాంప్రదాయాలు తొణికిసలాడే విధంగా పలు కార్యక్రమాలను నిర్వహించడంతో వెంకటాచలంలో గల స్వర్ణభారత్‌ట్రస్టుకు సంక్రాంతి శోభ వచ్చింది. ప్రతి ఏటా నిర్వ హిస్తున్న విధంగానే ఈ ఏడాది ట్రస్టులో గ్రామీణ వాతావర ణాన్ని, పండుగ సంబరాలు ప్రస్ఫుటమయ్యేలా కార్యక్రమాలను రూపొందించారు. భారతదేశ సంస్కృతీ సాంప్రదాయాలు సంస్కా రమంతమైనవని, ఆ దిశలో అందరూ పయనించాలని బిజెపి జాతీయనేత ఎం.వెంకయ్యనాయుడు పిలుపునిచ్చారు. స్వామి వివేకానంద బోధనలు జాతికి మార్గదర్శమన్నారు. ఆయన బోధ నలను పాఠ్యాంశాలుగా చేర్చాలని డిమాండ్ చేశారు. ఈ విష యమై పార్లమెంటు స్టాండింగ్ కమిటీలో చర్చకు పెడతాన న్నారు. మహాత్మాగాంధీ కలలుగన్న గ్రామీణాభివృద్ధిని కోరుతూ స్వర్ణభారత్ పలు కార్యక్రమాలను నిర్వహించడాన్ని కర్నాటక ఉపముఖ్యమంత్రి అశోక్ అభినందించారు. నిరుద్యోగ యువతకు శిక్షణనివ్వడం ప్రశంసనీయమన్నారు. సంక్రాంతి గ్రామాల పం డుగ అని అలాంటి పండుగల ప్రాశస్త్యాన్ని, సంస్కృతీ సాంప్ర దాయాలను భావితరాలకు తెలియపరచేలా ట్రస్టు చేస్తున్న కృషిని ఆర్ఎస్ఎస్ నేత రామ్‌మాధవ్ కొనియాడారు. కార్య క్రమాల నిర్వహణలో దీపా వెంకట్ ప్రతిభ చూపారు. ఈ సం దర్భంగా సినీ నేపథ్య గాయకుడు మనో నిర్వహించిన సంగీత విభావరి ఆకట్టుకొంది. ఈ కార్యక్రమంలో కర్నాటక ఎంపి మోహన్, మాజీ మంత్రి కట్టా సుబ్రహ్మణ్యం నాయుడు, బిజెపి నేత హరిబాబు, మాజీ ఎమ్మెల్యే బొల్లినేని కృష్ణయ్య, ఆర్ఎస్ఎస్ ప్రచారక్ సుకుమార్, కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్ రావు, వెంకటగిరి శాసనసభ్యుడు కురుగొండ్ల రామకృష్ణ తది తరులు పాల్గొన్నారు.



● పేదల

# భూములు గుటకాయ స్వాహా!

ప్రభుత్వం పేదలకు పంచిన భూమిని పెద్దలు తమ గుప్పిట్లో పెట్టు కొని సాగు చేసుకొంటున్న వైనం సీతా రామపురం మండలం అయ్యవారిపల్లి ఎస్సీ కాలనీలో జరుగుతోంది. ఇక్కడ గల ఎస్సీలకు 50 ఎకరాల సిజెఎఫ్ఎస్ భూము లను ఇచ్చారు. అమాయకులైన వీరి వద్ద నుంచి విజయవాడకు చెందిన కొందరు భూస్వాములు మాయమాటలు చెప్పి లీజుకు తీసుకున్నారు. ఒక్కో లబ్ధిదారునికి 500 రూపాయలు ఇచ్చి ఈ భూములను లీజు పేరుతో తీసుకొన్న వారు ఆ తర్వాత వాటిని స్వాధీనం చేసుకొని మినుము తది తర పంటలు సాగు చేసుకొంటున్నారు. తిరిగి ఆ భూములను తమకు అప్పగిం చాలని చాలాకాలంగా ఎస్సీలు భూస్వా ములను కోరుతున్నా ఈ మాట లక్ష్యపెట్ట కుండా తమ చెప్పుచేతల్లోనే భూములు వుంచుకొని దర్జాగా సాగు చేసుకొంటూ లాభాలు గడిస్తున్నారు. ఇప్పుడు వీరి కన్ను ఈ భూములపై పడింది. వీటిని శాశ్వ తంగా తమ సొంతం చేసుకొంటే వీరి బాధ వుండదని భావించి కొందరు రెవెన్యూ సిబ్బందిని మచ్చిక చేసుకొని ప్రయత్నాలు సాగిస్తున్నారట. వీరి కుట్రను గుర్తించిన ఎస్సీలు తమకు జరిగిన అన్యా యాన్ని జిల్లా అధికారులకు తెలిపితే ఆ భూములను ఎస్సీలకు అప్పగించాలని ఆదే శాలు ఇచ్చినా అవి ఇంతవరకు అమలు కాలేదు. పట్టాదారు పాసుపుస్తకాలు, ఇతర పత్రాలు తమ పేరుతో వున్నా కొం దరు రెవెన్యూసిబ్బంది ఆ భూస్వాములతో కుమ్మక్కై తమ భూములను లాగేసుకొనే ప్రయత్నం చేస్తున్నారని ఆరోపిస్తున్నారు. ఇప్పటికైనా జిల్లా కలెక్టర్ స్పందించి న్యాయం చేయాలని వేడుకొంటున్నారు.

**అయ్యవారిపల్లె పెద్దల భాగోతం**

# వెంకటగిరిలో తిష్టవేసిన సమస్యలు!

## పట్టించుకోని ప్రజాప్రతినిధులు, అధికారులు

మెట్టప్రాంతమైన వెంకటగిరి నియోజకవర్గం అభివృద్ధికి నోచుకోవడం లేదు. ప్రజాప్రతినిధులు ఇచ్చిన హామీలు నెర వేరకపోవడంతో అటు సాగునీటికి, ఇటు త్రాగునీటికి ఇబ్బంది పడాల్సిన పరిస్థితులు తలెత్తుతున్నాయి. మునిసిపాల్టీ హోదా సంతరించుకొన్నప్పటికీ పట్టణ పరిధితోపాటు నియోజకవర్గం లోని వివిధ ప్రాంతాలు అభివృద్ధికి నోచుకోవడం లేదు. ప్రజ లకు కనీస సౌకర్యాలైన విద్య, వైద్యం, త్రాగునీరు, రవాణా తదితర రంగాల్లో ఆశించినంత ఫలితం లేకుండాపోయింది. వర్షాభావం కారణంగా నియోజకవర్గంలో సాగునీటికి తీవ్ర ఇబ్బందులు ఏర్పడ్డాయి. చెరువులు నిండకపోవడం, ప్రధాన సాగునీటి వనరులైన సాయిగంగ బ్రాంచి కాలువలు, ఎస్ఎస్ కాలువ నిర్మాణ పనులు పూర్తికాకపోవడంతో రైతులు వరి సాగు చేయలేకపోతున్నారు. వివిధ మండలాల్లో గల ప్రాథ మిక ఆరోగ్య కేంద్రాల్లో వైద్యం అందడం లేదు. డక్కిలిలో గురుకుల పాఠశాల వున్నా తగిన వసతులకు నోచుకోలేదు. బాలాయపల్లి మండలం వెంగమాంబపురంలో గల ప్రభుత్వ జూనియర్ కాలేజి పరిస్థితి అధ్వాన్నంగా వుంది. ఇక వెంకట గిరి పట్టణాన్ని పరిశీలిస్తే అస్తవ్యస్తంగా వుంది. 70 కోట్లతో నిర్మిస్తున్న సమ్మర్‌స్టోరేజ్ ట్యాంకు నిర్మాణ పనులు నత్తనడకన సాగుతున్నాయి. రోడ్లన్నీ ధ్వంసమై పోయాయి. త్రాగునీటికి ఇబ్బంది పడుతున్నారు ప్రజలు. కేంద్రీయ విద్యాలయం భవన నిర్మాణ పనులు నిధుల కొరతతో నిలచిపోయాయి. చాలా కాలంగా ఇక్కడి ప్రజలు కోరుకొంటున్న శేషాద్రి, కొచ్చిన్ ఎక్స్ ప్రెస్ రైళ్ల నిలుపుదల జరగలేదు. స్థానిక ఎమ్మెల్యే కురుగొండ రామకృష్ణ ప్రతిపక్ష పార్టీకి చెందిన వ్యక్తి కావడంతో ప్రభుత్వం నుంచి తగిన నిధులు తీసుకవచ్చి అభివృద్ధి పనులు చేయ డంలో ఆటంకాలు ఎదురౌతున్నాయి. మరోవైపు అధికారపార్టీకి చెందిన ఎంపి చింతామోహన్ వున్నా ఆశించిన మేర సమ స్యలు పరిష్కారం కాకపోవడంతో ప్రజలు తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు.

# అభివృద్ధికి ఆ నాలుగే ఆటంకాలు!

## గూడూరులో కుండబద్దలు కొట్టిన చింతా



ఉన్న విషయాన్ని కుండ బద్దలు కొట్టినట్లు మాట్లా డడం తిరుపతి ఎమ్పీ చింతా మోహ న్‌కు అలవాటు. ఇటీవల గూడూరు డివిజన్‌తోపాటు పట్టణంలో జరిగిన పలు అభివృద్ధి కార్యక్రమాలలో ఆర్థికమంత్రి ఆనం రామనారాయణ రెడ్డితో కలసి పాల్గొన్నాడు. ఈ సం దర్భంగా ఆయన మాట్లాడుతూ గూడూరు డివిజన్ అభివృద్ధికి ప్రధానంగా షార్ సెంటర్, పులికాట్ సరస్సు, నేలపట్టు పక్షుల కేంద్రం, వెంకటగిరి చుట్టుప్రక్కల గల అటవీప్రాంతాలు కారణ మంటూ వీటిని అభివృద్ధికి అడ్డుతగులుతున్న నాలుగు దెయ్యా లుగా అభివర్ణించారు. వీటి వల్లనే ఈ ప్రాంతాన్ని తగినంత అభి వృద్ధి చేయలేకపోతున్నామని అనడంతో సమావేశంలో కలకలం రేగింది. ఎన్నో అంతరిక్ష పరిశోధనలకు నిలయమై ప్రపంచ స్థాయి గుర్తింపు పొందిన షార్ సెంటర్, పర్యాటక రంగానికే తల మానికంగా నిలిచే పులికాట్ సరస్సు, నేలపట్టు పక్షుల కేంద్రాన్ని అభివృద్ధికి ఆటంకాలుగా, దెయ్యాలతో పోల్చడాన్ని పలువురు తప్పుపట్టారు. అదే కార్యక్రమంలో పాల్గొన్న ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి మాట్లాడుతూ పేద ప్రజలను ఆదుకోవడంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఎప్పుడూ ముందుంటుందన్నారు. 2014లో జరిగే ఎన్నికల్లోనూ తిరిగి కాంగ్రెస్‌పార్టీ విజయం సాధిస్తుందన్న ధీమా వ్యక్తం చేశారు. అల్లూరు ఆదిశేషారెడ్డి స్టేడియంలో జరిగిన ఈ కార్యక్రమంలో డివిజన్‌లోని 1568 మంది లబ్ధిదారులకు 1404 ఎకరాల భూమిని పంపిణీ చేశారు. అలాగే 2097 మందికి 5.72 కోట్ల పొదుపు రుణాలు, 19,725 మందికి రేషన్‌కార్డులు, 6162 మందికి దీపం కనెక్షన్లు పంపిణీ చేశారు. ఈ కార్యక్ర మంలో గూడూరు, సూళ్లూరుపేట, వెంకటగిరి శాసనసభ్యులు బల్లి దుర్గాప్రసాద్, పరసారత్నం, కురుగొండ్ల రామకృష్ణ, జిల్లా కలెక్టరు శ్రీధర్, సబ్‌కలెక్టర్ నివాస్ తదితరులు పాల్గొన్నారు.

# మానవ వనరులే గొప్ప సంపద!

## ● యువతకు సర్టిఫికేట్ల ప్రధానోత్సవంలో బీద

దేశానికి మానవ వనరులే గొప్ప సంపద అని, వాటిని సక్రమమైన పద్ధతిలో వినియోగించుకొని ఉన్నత స్థితికి చేరుకోవాలని కావలి శాసన సభ్యుడు బీద మస్తాన్‌రావు ఆకాంక్షించారు. స్థానిక ఎంపిడిఓ కార్యాలయంలో ఎలక్ట్రికల్ ట్రేడ్‌లో శిక్షణ పొందిన వారికి సర్టిఫికేట్ల ప్రదానం జరిగింది. ఈ కార్య క్రమానికి అతిథిగా విచ్చేసిన మస్తాన్‌రావు మాట్లాడుతూ అధిక జనాభా కల్గిన దేశం మనదంటూ అందరూ మానవ వనరులను సద్వినియోగం చేసుకొని అభి వృద్ధి చెందుతుందన్నారు. ప్రతి వ్యక్తి వృద్ధిలోకి రావడం వలన దేశం అభివృద్ధి సాధించాలన్నారు. నిరుద్యోగ యువత ఉపాధి అవకాశాలను అందిపుచ్చుకొని సొంతకాళ్లపై నిలబడాలన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొనే పొచంపల్లికి చెందిన స్వామి దయానంద తీర్థ రూరల్ ఇనిస్టిట్యూట్, బిఎంఆర్ ట్రస్టు సంయుక్త ఆధ్వర్యంలో ఎలక్ట్రికల్ విభాగంలో పురుషులకు, కుట్టు విభాగంలో మహిళలకు శిక్షణ ఇప్పించామన్నారు. డిఆర్‌డిఏ పిడి వెంకట సుబ్బయ్య మాట్లాడుతూ ఎమ్మెల్యే మస్తాన్‌రావు సొంత నిధులతో ఇలాంటి శిక్షణా కార్యక్రమాలు ఏర్పాటు చేయడం అభినందనీయం అన్నారు. నిరుద్యోగ యువత వీటిని సద్వినియోగం చేసుకోవా లన్నారు. ఈ కార్యక్రమంలో ఎంపిడిఓ వసుంధర తదితరులు పాల్గొన్నారు.

● జగన్ విడుదల కోరుతూ...

# కావలిలో జోరుగా సంతకాల సేకరణ!



వైఎస్ జగన్ విడుదల కోరుతూ వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ చేపట్టిన కోటి సంతకాల సేకరణ కార్యక్రమం కావలి పట్టణంలో జోరుగా సాగుతోంది. వివిధ ప్రాంతాలలో ప్రత్యేక శిబిరాలు ఏర్పాటు చేసి వివిధ వర్గాల ప్రజల నుంచి సంతకాలు సేకరిస్తున్నారు. నియోజకవర్గ ఇన్‌చార్జి రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి ఆధ్వర్యంలో జరుగుతున్న ఈ కార్యక్రమంలో ప్రజలు ఉత్సాహంగా పాల్గొన్నారు. ఈ సందర్భంగా ప్రతాప్‌కుమార్‌రెడ్డి మాట్లాడుతూ జగన్‌ను జైలులో పెట్టడంలో పెద్ద కుట్ర దాగివుందన్నారు. కాంగ్రెస్ అధినేత్రి సోనియాగాంధీ ప్రజల్లో జగన్‌కున్న ఆదరణ చూసి తట్టుకోలేక పలురకాలుగా వేధిస్తున్నారని ఆరోపించారు. ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజాభీష్టాన్ని మన్నించి జగన్‌ను విడుదల చేయాలని కోరారు. జిల్లాలో జరుగనున్న సహకార ఎన్నికల్లో దొడ్డిదారిన గెలిచేందుకు అధికార కాంగ్రెస్‌పార్టీ కుట్రపన్నుతోందన్నారు. పలు ప్రాంతాలలో అవకతవకలకు పాల్పడుతున్నారని, అల్లూరులో సభ్యుల జాబితాలో డబుల్ ఎంట్రీలు వున్నాయన్నారు. అధికారులు కాంగ్రెస్ నేతలు చెప్పినట్లు వింటున్నారని ఆరోపించారు. ఎవరు ఎన్ని కుట్రలు చేసినా అన్ని సహకార సంఘాలను వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ కైవసం చేసుకుంటుందన్న ధీమా వ్యక్తం చేశారు. ఈ కార్యక్రమంలో ఆ పార్టీ నేతలు చింతం బాబురెడ్డి, షాహుల్ హమీద్, హజరత్‌రెడ్డి, మాల్యాద్రి, వెంకట్రామిరెడ్డి, విజయకుమార్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# రైల్వే బిట్రగుంటను పట్టించుకోండి!

## రైల్వే యూజర్స్ కమిటీ సభ్యుడు బొడ్డు



బిట్రగుంటను రైల్వేపరంగా అభివృద్ధి చేసేందుకు అన్ని రకాల చర్యలు చేపట్టాలని జోనల్ రైల్వే యూజర్స్ కమిటీ సభ్యుడు బొడ్డు మురళీ మోహన్‌రెడ్డి రైల్వే అధికారులను కోరారు. ఇటీవల సికింద్రాబాద్‌లో రైల్వే జోనల్ యూజర్స్ సమావేశం జరిగింది. ఈ సమావేశానికి హాజరైన మురళీమోహన్‌రెడ్డి బిట్రగుంట రైల్వేకు ఉన్న ఆస్తులు, అని నిరాదరణకు గురైన విషయం, ప్రయాణీకుల సౌలభ్యం కోసం తీసుకోవాల్సిన చర్యలపై రైల్వే జిఎం ఆస్థాన్‌కు వివరించారు. బిట్రగుంటలో రైల్వేకు అధికారికంగా 1300 ఎకరాల స్థలం వుందన్నారు. ఇంత పెద్ద విశాలమైన స్థలాలు వున్నా రైల్వే పరంగా ఎలాంటి అభివృద్ధికి నోచుకోవడం లేదన్నారు. ఇతర రాష్ట్రాల్లో రైల్వే అభివృద్ధి, స్థల సేకరణ కోసం కోట్లు ఖర్చు పెడుతుంటే బిట్రగుంటలో మాత్రం నిర్లక్ష్యం కొనసాగుతుందని ఆవేదన వ్యక్తం చేశారు. అలాగే ఎక్స్‌ప్రెస్ రైళ్లను ఆపడం లేదన్నారు. పినాకినికి ఇక్కడ స్టాపింగ్ ఇవ్వాలని పలువురు ప్రజాప్రతినిధులు కోరినా ప్రయోజనం లేకుండా పోయిందన్నారు. రైళ్లలో జరుగుతున్న ప్రమాదాలను దోపిడీలను దృష్టిలో వుంచుకొని సిసి కెమెరాలు అమర్చాలని, బందోబస్తు పెంచాలని, డిమాండ్ చేస్తూ జిఎంకు వినతి పత్రం సమర్పించారు.



# భోజన నిర్వాహకురాలి ఎంపిక కోసం ఎన్నిక!

పిల్లలకు మధ్యాహ్న భోజనాన్ని అందించే నిర్వాహకురాలి ఎంపికలోను రాజకీయాలు చోటు చేసుకొని గందరగోళానికి దారి తీసిన పరిస్థితులు నెలకొన్నాయి కలువాయిలో. అక్కడి జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో మధ్యాహ్న భోజన నిర్వాహకురాలి ఎంపికలోనూ వర్గ రాజకీయాలు పొడచూపాయి. నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ వర్గం వారు, ఆనం రామనారాయణరెడ్డి వర్గానికి చెందిన వ్యక్తులు ఈ ఎంపికకు పోటీ పడడంతో ఎన్నికల సమరాన్ని తలపించాయి. ప్రధానోపాధ్యాయురాలు వసుంధరాదేవి అధ్యక్షతన జరిగిన ఈ ఎంపికకు మొత్తం 24మంది ఎస్ఎంసి సభ్యులకుగాను 21మంది సభ్యులు హాజరయ్యారు. ఈ ఎంపికకు సంబంధించిన మార్గదర్శకాలపై ప్రధానోపాధ్యాయురాలికి సరైన అవగాహన లేక పోవడం, ఓటింగ్ జరపాలని కొందరు, వద్దని మరికొందరు వాగ్వివాదానికి దిగడంతో సమావేశం అరుపులు కేకలతో దద్దరిల్లిపోయింది. వీటికి రాజకీయ నేతలు రంగప్రవేశం చేయడంతో ఉద్రిక్తత నెలకొనింది. దీనికి భయపడిన ప్రధానోపాధ్యాయురాలు కన్నీళ్లు పెట్టుకొని సమావేశాన్ని రద్దు చేయాలని భావించగా మండల కాంగ్రెస్ నేతలు, మాజీ ఎంపిపి అనిల్ కుమార్‌రెడ్డి ఆమెకు ధైర్యం చెప్పి ఓటింగ్ పద్ధతిలో భోజన నిర్వాహకురాలి ఎంపిక ప్రక్రియ పూర్తయ్యేలా చేశారు. మొత్తం ఐదు గ్రూపుల నుంచి ఐదుగురు మహిళలు పోటీపడగా వెంకటరమణమ్మ పొదుపు సంఘానికి చెందిన చల్లా విజయమ్మను 16మంది ప్రతిపాదించగా, స్వర్ణముఖి సంఘానికి చెందిన సుజాతమ్మను ముగ్గురు ప్రతిపాదించారు. ఇద్దరు సభ్యులు ఓటింగ్‌లో పాల్గొన లేదు. మొత్తం మీద పాఠశాలల్లో భోజనం వండే వారి ఎంపికలకు రాజకీయరంగు పులుముకోవడంపై పలువురు అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు.

## కలువాయి హైస్కూల్‌లో పడగవిప్పిన రాజకీయం

# ప్రభుత్వ వైద్యశాలలపై చిత్తశుద్ధి లేదు!

## వెంకటగిరి ఎమ్మెల్యే విసుర్లు



ప్రభుత్వ వైద్యశాలలపై రాష్ట్ర ప్రభుత్వానికి చిత్తశుద్ధి లేదని వెంకటగిరి శాసనసభ్యుడు కురుగొండ్ల రామకృష్ణ విమర్శించారు. స్థానికంగా జరిగిన క్లస్టర్ వైద్యశాల అభివృద్ధి కమిటీ సమావేశంలో పాల్గొన్న ఆయన ప్రభుత్వ తీరు, వైద్యసిబ్బంది నిర్లక్ష్యంపై తీవ్రంగా స్పందించారు. ఇతర రాష్ట్రాల్లో ప్రైవేటు ఆసుపత్రులకు పోటీగా ప్రభుత్వ వైద్యశాలలను అభివృద్ధి చేస్తూ మెరుగైన సేవల అందేలా చూస్తుంటే మన రాష్ట్రంలో మాత్రం ప్రభుత్వ వైద్యశాలల పరిస్థితి దయనీయంగా వున్నాయన్నారు. తగిన వైద్యం అందకపోవడంతో ఇక్కడకు రావాలంటేనే ప్రజలు భయపడుతున్నారన్నారు. ఆస్పత్రుల్లో వసతుల కల్పన, ఇతర ప్రోత్సాహకాలు అందించడంలో ప్రభుత్వం తగిన చర్యలు చేపట్టకపోవడం వల్లే ప్రభుత్వ ఆస్పత్రులపై ప్రజలకు నమ్మకం పోతోందన్నారు. అభివృద్ధి కమిటీకి మంజూరైన లక్ష రూపాయల నిధులతో ఇన్వర్టర్ల ఏర్పాటు చేసుకోవాలని, త్రాగునీటి మోటారు, విద్యుత్ మరమ్మత్తులు చేయించాలని, జంగిల్ క్లియరెన్స్ నిర్వహించాలని కమిటీ నిర్ణయించింది. సమావేశం అనంతరం ఆస్పత్రిలో గల దంత వైద్య విభాగాన్ని పరిశీలించిన ఎమ్మెల్యే అక్కడి అపరిశుభ్ర వాతావరణం చూసి సిబ్బందిపై మండిపడ్డారు. చిన్న చిన్న మరమ్మత్తులు చేయించకుండా దంతవైద్య విభాగాన్ని ప్రజలకు అందుబాటులో లేకుండా చేస్తున్నారని ఆగ్రహించారు. ఈ సమావేశంలో అదనపు జిల్లా వైద్యాధికారి పద్మావతి, క్లస్టర్ అధికారిణి కోటేశ్వరమ్మ, స్థానిక వైద్యులు జిలానీ, శాంతి తదితరులు పాల్గొన్నారు.

● చెముడుగుంటలో

# అదునుచూసి దొంగతనం!

## ఆరు లక్షల రూపాయలు దోచేశారు

జిల్లాలో దొంగతనాలకు అంతే లేకుండాపోతుంది. పోలీసులు దొంగతనాలను అరికట్టడంలో పటిష్టమైన చర్యలు తీసుకొంటున్నామని చెప్తున్నప్పటికీ అవి ఆగడం లేదు. దీనికి తాజా ఉదాహరణ వెంకటాచలం మండలంలో జరిగిన దొంగతనం. మండల పరిధిలోని చెముడుగుంట పవన్‌కాలనీలో నివసించే పద్మశేఖర్ ఇంట్లో దొంగలు పడి ఆరు లక్షల రూపాయలు విలువ చేసే నగలు, నగదు దోచుకెళ్లారు. ఈ ఘటన మండలంలో కలకలం రేపింది. సంక్రాంతి సెలవులకని ఊరికెళ్లి వుండగా ఇంట్లో అతని తల్లిదండ్రులు మాత్రమే వున్నారు. ఆ సమయంలో దొంగలు తలుపులు పగులగొట్టి బీరువాలోని బంగారు ఆభరణాలు, వెండి వస్తువులు, నగదు తస్కరించుకొనిపోయారు. దీనిపై బాధితుడు పోలీసులకు ఫిర్యాదు చేయడంతో క్లూస్ టీం సిఐ శివారెడ్డి, వెంకటాచలం ఎస్‌ఐ సోమయ్య సంఘటనా స్థలాన్ని పరిశీలించి కేసు దర్యాప్తు చేస్తున్నారు.

● కావలిలో

# దొంగలు బాబోయ్ దొంగలు!

కావలి నియోజకవర్గ స్థాయిలో దొంగతనాలు జోరందుకొన్నాయి. పగలు, రాత్రి అనే తేడా లేకుండా ఇళ్లలోపడి మొత్తం దోచుకపోతుండడంతో ప్రజలు హడలిపోతున్నారు. వరుస దొంగతనాలతో పట్టణం అట్టుడికిపోతున్నా, ప్రజలు భయాందోళనలు చెందుతున్నా పోలీసులు తగిన విధంగా వ్యవహరించక పోతుండడంపై విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.

## దడుచుకొంటున్న ప్రజలు

కావలి పట్టణంతోపాటు నియోజకవర్గంలోని వివిధ ప్రాంతాల్లో దొంగతనాలు జరుగుతున్నాయి. బోగోలు మండలంలో పలుచోట్ల దొంగలుపడి అందినంత పట్టుకపోతున్నారు. బోగోలులో జెరాక్స్‌షాపులు, చిల్లర అంగళ్లు, టిఫిన్ సెంటర్లను వదలకుండా దొంగతనం చేస్తుండడంతో కంటిమీద కునుకు లేకుండా పోతోందని ప్రజలు వాపోతున్నారు. ఇప్పటికైనా అధికారులు స్పందించి దొంగతనాలు అరికట్టాలని, పాత నేరస్తులపై నిఘా పెట్టాలని పలు ప్రాంతాల ప్రజలు కోరుకొంటున్నారు.

# చట్టాలపై అవగాహన పెంచుకోండి!

జిల్లాలో భూ తగాదాలు అధికం కావడానికి ప్రధాన కారణం అడంగళ్లు సక్రమంగా లేకపోవడమేనని జిల్లా న్యాయసేవాధికార సంస్థ కార్యదర్శి, సీనియర్ సివిల్ జడ్జి ఎం.రామకృష్ణ తెలిపారు. కోడూరు గ్రామంలో జరిగిన న్యాయ విజ్ఞాన సదస్సులో పాల్గొన్న ఆయన పలు అంశాలపై ప్రజలకు అర్థమయ్యేలా, అవగాహన కలిగేలా ఉపన్యసించారు. భూ సమస్యలు పరిష్కారం కావాలంటే రైతులు ముందుగా భూముల వివరాలను అడంగళ్‌లో నమోదు చేసుకోవాలన్నారు. జనన మరణాలు, వివాహ ధృవీకరణలు చట్టబద్ధం చేసుకోవాలన్నారు. చిన్నచిన్న వాటికి కోర్టులకు ఎక్కితే ఎంత ఆలస్యమవుతుందో తెలియజెప్పేందుకు పిట్టకథ చెప్పి నవ్వించారు. ప్రతి ఒక్కరూ చట్టంపై కనీసపాటి అవగాహన కలిగి వుండాలన్నారు. గతంలో గ్రామాల్లో గొడవలు, తగాదాలు పడినప్పుడు గ్రామ పెద్దలు జోక్యం చేసుకొని తీర్పు చెప్పి సర్దుబాటు చేసేవారని, నేడు ఆ పరిస్థితి లేదన్నారు. న్యాయవిజ్ఞాన సదస్సులు అధిక జనాభా వున్న పేదల కాలనీలలో నిర్వహించినప్పుడే ప్రయోజనం వుంటుందన్నారు. ఎస్‌ఐ సాంబశివరావు అధ్యక్షతన జరిగిన ఈ సదస్సులో సీనియర్ న్యాయవాది రంగనాథం, శివకామేశ్వరి తదితరులు పాల్గొన్నారు.



సమావేశంలో మాట్లాడుతున్న ఇ.వి.ఎస్.నాయుడు.

# కాంగ్రెస్ దుర్మార్గాలు సాగనివ్వం!

## ఉదయగిరి ఎమ్మెల్యే చంద్రశేఖర్‌రెడ్డి



కాంగ్రెస్‌పార్టీ నేతల దుర్మార్గాలకు త్వరలోనే ప్రజలు చరమగీతం పాడనున్నారని ఉదయగిరి శాసనసభ్యుడు మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి తెలిపారు. అధికారమదంతో ఇష్టానుసారంగా వ్యవరించే వారికి ప్రజలు తగిన గుణపాఠం చెప్పేరోజు దగ్గర్లోనే వుందన్నారు. ఉదయగిరిలో ఇటీవల నిర్వహించిన విలేకరుల సమావేశంలో ఆయన మాట్లాడారు. భూపంపిణీలో అవకతవకలకు పాల్పడుతూ కాంగ్రెస్ నేతలు లబ్ధి పొందేందుకు ప్రయత్నించగా తాము అడ్డుకొని కోర్టు నుంచి స్టే తెప్పించామన్నారు. అర్హులైన నిరుపేదలకు న్యాయం చేయాలని భావించి ఇష్టానుసారం అధికార పార్టీ నేతలు రూపొందించిన జాబితా అమలు కాకుండా చూశామన్నారు. వీరి అక్రమాలు బయట పడకుండా వుండేందుకు తనపై బురదచల్లే ప్రయత్నం చేస్తున్నారని ఆరోపించారు. వీరి తీరు చూస్తుంటే దొంగే దొంగ దొంగ అని అరచినట్లుందని విమర్శించారు. కోర్టు ఆదేశాలను లెక్కచేయకుండా అధికార దాహంతో జాబితా ఆమోదించుకొనేందుకు సిద్ధమౌతున్నారని ఆరోపించారు. జాబితాపై కమిటీ ఛైర్మన్ అయిన తన సంతకం లేకపోవడంతో ఇన్‌చార్జ్ మంత్రి వాటిని తిప్పిపంపారన్నారు. సొసైటీ ఎన్నికల్లోనూ అక్రమాలకు పాల్పడి గెలిచేందుకు ప్రయత్నిస్తున్నారని ఆరోపించారు. కాంగ్రెస్ పార్టీ వారు చేసే దుర్మార్గాలను, అవినీతి అక్రమాలను అడ్డుకొని తీరుతామన్నారు.

# బోగోలులో వైద్యం గగన కుసుమం!

బోగోలు మండలంలోని ప్రజలకు వైద్య సేవలు అందడం లేదు. కోవూరుపల్లిలో ఆరోగ్య కేంద్రం వున్నా అది నామమాత్రంగా మారడంతో వివిధ ప్రాంతాల నుంచి ఇక్కడకు వచ్చే వారు వైద్యం అందక ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. వైద్యసేవలు అందించేందుకు వైద్య సిబ్బంది అందుబాటులో వుండకపోవడంతో వైద్యం అందని పరిస్థితి ఎదురౌతోంది. ఇక్కడ పనిచేసే డాక్టర్ ఎప్పుడూ ఆరోగ్యకేంద్రానికి రాదు. దీనిపై ప్రశ్నిస్తే సమావేశానికి వెళ్లిందనే సమాధానం చెప్తుంటారు. నర్సింగ్ సిబ్బంది వున్నా వాళ్లు ఎప్పుడు వస్తారో, ఎప్పుడు పోతారో తెలియదు. చుట్టపు చూపుగా వచ్చి వెళ్తుండడంతో వివిధ రోగాలకు చికిత్స చేసుకొనేందుకు వచ్చే వాళ్లు, అత్యవసరవైద్యం కోసం వచ్చేవారు వైద్యం అందక, ప్రైవేట్ ఆస్పత్రులకు వెళ్లలేక అల్లాడిపోతున్నారు. అర్ధరాత్రి సమయాల్లో అత్యవసరమై వచ్చి వైద్య సిబ్బందికి సమాచారం పంపితే నిద్రాభంగమైనందుకు వచ్చినవారిపై ఎప్పుడంటే అప్పుడు వచ్చి వైద్యం అందించమంటే ఎట్లా అని విసుక్కొంటున్నారని మండల ప్రజలు వాపోతున్నారు. అధికారులకు దీనిపై పలుమార్లు ఫిర్యాదు చేసినా స్పందన లేకుండా పోయిందని, ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు చొరవ చూపి బోగోలు పంచాయితీలో వైద్య సేవలు అందుబాటులో వుండేలా చూడాలని, లేదంటే సొంత ట్రస్టునుంచైనా నిధులు అందించి వైద్య కేంద్రం ఏర్పాటు చేయించి ప్రాణాలు కాపాడాలని మండల ప్రజలు కోరుకొంటున్నారు.

● దుత్తలూరు

# తహశీల్దార్ కార్యాలయంలో దొంగతనం!

## రికార్డు తస్కరణ కోసం యత్నం?

దుత్తలూరు తహశీల్దార్ కార్యాలయంలో దొంగతనానికి యత్నించడం కలకలం రేపింది. సంక్రాంతి సెలవులకు వెళ్లిన సిబ్బంది తిరిగి విధులకు హాజరైన సందర్భంలో కార్యాలయానికి వచ్చినప్పుడు ఎమ్మార్వో గది తాళాలు పగులగొట్టి వుండడం, కంప్యూటర్ గది తలుపులు తెరచుకొని వుండడంతో సిబ్బంది సమాచారాన్ని ఎమ్మార్వోకు తెలిపారు. ఆయన వచ్చి చూసి పోలీసులకు ఫిర్యాదు చేశాడు. రికార్డులు, ఇతర కీలక సమాచారం ఏదైనా తస్కరించారా? ఎందుకు దొంగతనానికి యత్నించారు అనే దానిపై పోలీసులు విచారణ జరుపుతున్నారు. రెండు నెలల క్రిందట ఇలాగే మోటారును, విద్యుత్ తీగలను దొంగిలించారట. ఇప్పుడు ఏకంగా ఎమ్మార్వో గదిలో దొంగతనానికి యత్నించడంపై పలు అనుమానాలు వ్యక్తం అవుతున్నాయి. తెలిసిన వారే ఇందుకు పాల్పడి వుంటారనే అనుమానాలు వ్యక్తం అవుతున్నాయి.

# అభిషేక ప్రియుడు పరమశివుడు!



చరాచర సృష్టిని లయం చేసేవాడు పరమేశ్వరుడు. లయకారుడైన శివునికి అభిషేకాలంటే ప్రీతి. అందుకే అభిషేక ప్రియుడని పేరు. కరుణాంతరంగుడు, కోరిన వారికి కాదనకుండా వరాలిచ్చే ఈశ్వరుడు భోళాశంకరుడని ప్రసిద్ధి. క్షీరసాగర మథనం సమయంలో పుట్టిన హాలాహలాన్ని కంఠమందు ధరించి గరళ కంఠుడయ్యాడు. ప్రళయాగ్ని సమానమైన మూడోకన్ను కలవాడు కావడంతో త్రినేత్రుడయ్యాడు. అలాంటి పరమేశ్వరునికి ప్రీతికరమైన అభిషేకంతో పూజిస్తే శివుడు సంతోషించి కోరిన కోర్కెలు తీరుస్తాడని ప్రతీతి. శం అనగా మేలు అని, కర అంటే కూర్చువాడని అర్థం. అందరికి మేలు చేసేవాడు కాబట్టి శంకరుడయ్యాడు. సర్వాంతర్యామి అయిన ఆ స్వామిని భక్తితో అర్చిస్తే అభీష్టాలన్ని నెరవేరుస్తాడని చెప్తారు.

భక్తితో రెండు చుక్కల నీటిని విదిలించినా అమితానందభరితుడై ఆశీర్వదిస్తాడని పురాణాలు చెప్తున్నాయి. అందుకే అభిషేక ప్రియ శివః అంటారు. శివలింగంపై కాసింత నీళ్లు, కొంత పత్రిని వేసి పూజిస్తే కామధేనువు వారి ఇంట గాటకట్టిన పశువవుతుందని, దేవతా వృక్షమైన కల్పతరువు వారి ఇళ్లలోని పెరటిలో మల్లెచెట్టు అవుతుందని పురాణాల్లో వివరించబడింది. దేవాది దేవుడైన శివుడికి వివిధ ద్రవ్యాలతో చేసే అభిషేకం ఎన్నో ఫలితాలనిస్తుందని శాస్త్రవచనం. మహారుద్రాభిషేకం శివుడికి ప్రీతి. ఈ అభిషేకంతో జ్ఞానాభివృద్ధి కల్గుతుందంటారు. దారాభిషేకంతో సర్వపాపాలు నశిస్తాయి. రుద్రాభిషేకం చేస్తే సర్వ సంపదలు చేకూరుతాయని, ఏకాదశ రుద్రాభిషేకం చేస్తే శివునితోపాటు అమ్మవారి కటాక్షం లభిస్తుందంటారు. పాల నేత్రుడిని ఆవు పాలతో అభిషేకిస్తే సర్వసుఖాలు సిద్ధిస్తాయంటారు. పెరుగుతో చేసే అభిషేకం కీర్తిని, ఆరోగ్యాన్ని, బలాన్ని ఇస్తుంది. ఆవు నెయ్యితో అభిషేకిస్తే ఐశ్వర్యం సిద్ధిస్తుందని, తేనెతో చేసే అభిషేకం తేజస్సును వృద్ధి చేస్తుందంటారు. పంచదారతో చేసే అభిషేకం వలన దుఃఖాలు తొలగుతాయని అందుకే పంచామృతాభిషేకం అభిషేకాల్లో విశిష్టమైన ప్రాధాన్యతను సంతరించుకొంది. సర్వ సంపదలు లభించడానికి కొబ్బరినీళ్లతో అభిషేకించాలని శాస్త్రాలు చెబుతున్నాయి. విభూదితో అభిషేకిస్తే పాపాలు తొలగుతాయని, పుష్పాలతో చేసే అభిషేకం భూలాభాన్ని, జలాభిషేకం భోగభాగ్యాలను అందిస్తుందంటారు. అపమృత్యుభయంతో బాధపడేవారు శివుడిని నువ్వుల నూనెతో అభిషేకం చేస్తే దాని నుంచి కాపాడుతాడని శివపురాణంలో వివరించబడింది. శివుడు మనోకారకుడు. ధర్మప్రభోదాత. ఎక్కడ ధర్మం నాలుగు పాదాలపై నడుస్తుంటే అక్కడ కొలువై వుంటాడు. ఆత్మకారకుడైన ఆ స్వామిని స్వచ్ఛమైన మనస్సుతో అభిషేకించి పూజిస్తే శుభం కల్గుతుందని పురాణాలు వివరిస్తున్నాయి. జగద్గురువు ఆదిశంకరాచార్యుడు, భక్తకన్నప్ప, భక్త మార్కండేయుడు, శ్రీరాముడు శివుడిని నిర్మలమైన మనస్సుతో పూజించి తరించారు. సర్వపాపాలను తొలగించే, ముక్తిదాయకమైన శివనామాన్ని భక్తితో స్మరిస్తే మహాదేవుని కరుణకు పాత్రులవుతారు. J

నిరసన

## • విద్యుత్ సర్‌ఛార్జీలను నిరసిస్తూ...

# కలెక్టరేట్‌ను ముట్టడించిన ఎర్రదండు!

ఇంధన సర్‌ఛార్జీలపై వామపక్షాల ఆధ్వర్యంలో చేపట్టిన కలెక్టరేట్ ముట్టడి కార్యక్రమం ఉద్రిక్తతకు దారితీసింది. ప్రజలపై మోపిన కోట్ల రూపాయల మేర మోపిన మోతను వెంటనే రద్దు చేయాలని సిపిఎం, సిపిఐ నేతలు డిమాండ్ చేశారు. ఆ పార్టీల రాష్ట్ర కమిటీల పిలుపు మేరకు ఈనెల 22వ తేదిన జిల్లా కలెక్టరేట్ ముట్టడి కార్యక్రమం జరిగింది. జిల్లా నలుమూలల నుంచి భారీస్థాయిలో ప్రజలు తరలివచ్చి ముట్టడి కార్యక్రమంలో పాల్గొన్నారు. దక్షిణ వైపు ప్రధానగేటు వద్ద వామపక్ష నేతలు అడ్డుగా నిలబడి కలెక్టరేట్ ప్రాంగణంలోకి ఎవరి వాహనాలను వెళ్లనీయలేదు. దీంతో ఖజానా కార్యాలయం, డిఆర్‌డిఏ, పౌరసరఫరాలశాఖ, కలెక్టరేట్ ఉద్యోగులు సైతం విధులకు సకాలంలో వెళ్లలేకపోయారు.

ఈ సందర్భంగా పోలీసులు కూడా భారీ ఎత్తున మోహరింపచేశారు. ముట్టడి కార్యక్రమంలో పాల్గొన్న సిపిఐ జిల్లా కార్యదర్శి చంద్రరాజగోపాల్ మాట్లాడుతూ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజలపై అధిక భారం మోపుతున్నాయని విమర్శించారు. పేద, మధ్యతరగతి ప్రజలు పెంచిన ఇంధన సర్‌ఛార్జీలను చెల్లించలేక తీవ్ర ఇబ్బందులు పడుతున్నారన్నారు. గత రెండు నెలలుగా సర్‌ఛార్జీలను వసూలు చేస్తూ కోట్ల రూపాయల ఆదాయం ప్రభుత్వం గడిస్తుందని దుయ్యబట్టారు. భవిష్యత్‌లో మరింత అదనపు భారం వసేందుకు ప్రభుత్వం ప్రయత్నిస్తుందని ఆరోపించారు. ప్రజల అవసరాలను ఏమాత్రం గుర్తించకపోవడం, సంక్షేమం గురించి పూర్తిగా విస్మరించడం చేస్తున్న ముఖ్యమంత్రికి ఛార్జీలు పెంచే అధికారం లేదన్నారు.

సిపిఐ జిల్లా కార్యదర్శి పి.రామరాజు మాట్లాడుతూ 2010వ సంవత్సరం జూన్ నుంచి ఇంధన సర్‌ఛార్జీలను ప్రస్తుతం వసూలు చేయడం ఏమిటని ప్రభుత్వాన్ని ప్రశ్నించారు. పెరిగిన నిత్యావసరాల ధరలతో పేదల ప్రజలు అనేక ఇబ్బందుల పడుతుంటే ఇంధన సర్‌ఛార్జీలు చెల్లించాలని ఒత్తిడి తేవడం విడ్డూరంగా వుందని విమర్శించారు. రాష్ట్రముఖ్యమంత్రి ప్రజలపై మరింత భారం వేయడాన్ని అందరూ వ్యతిరేకించాలని విజ్ఞప్తి చేశారు. ప్రభుత్వం ప్రజల ఆందోళనకు దిగిరాకుంటే రాష్ట్రవ్యాప్తంగా ఉద్యమాలను నిర్వహించాల్సి వుంటుందని ఆయన హెచ్చరించారు. కలెక్టరేట్ ముట్టడి కార్యక్రమానికి ఊహించని విధంగా ప్రజలు తరలిరావడంతో నగరంలో రాకపోకలకు తీవ్ర అంతరాయం కలిగింది. గాంధీబొమ్మ నుంచి విఆర్సీ, జడ్పీ కార్యాలయం మీదుగా భారీ ఊరేగింపు నిర్వహించి ప్రభుత్వానికి వ్యతిరేకంగా నినాదాలు చేశారు.

కలెక్టరేట్‌లోకి ఉద్యోగులు వెళ్లేందుకు అనుమతించకపోవడంతో పోలీసులు రంగప్రవేశం చేయాల్సి వచ్చింది. వామపక్షాల నేతలు, పోలీసులకు మధ్య వాదోపవాదాలు చోటు చేసుకుని ఒకరినొకరు తోసుకున్నారు. అక్కడే విధి నిర్వహణలో వున్న సి.ఐ, ఎస్సైలు జోక్యం చేసుకొని ఆందోళన కార్యక్రమాన్ని విరమించకుంటే అరెస్టు చేయాల్సి వుంటుందని హెచ్చరికలు చేశారు. అయినా కూడా నేతలు, కార్యకర్తలు ఆందోళన విరమించలేదు. దీంతో రెండు వ్యాన్లను రప్పించి ఆందోళన చేస్తున్న కార్యకర్తలు, నేతలను పోలీసులు బలవంతంగా పట్టుకొని వాహనాల్లోకి ఎక్కించారు. ఇంతలో డిజిపి దినేష్‌రెడ్డి సండేమార్కెట్ వద్ద నున్న



విద్యుత్ సర్‌ఛార్జీలకు నిరసనగా నెల్లూరులో వామపక్షాల ఆధ్వర్యంలో జరిగిన ర్యాలీలో పెద్ద సంఖ్యలో పాల్గొన్న ప్రజలు.

ఒక దేవాలయానికి వస్తున్నారని సమాచారం అందడంతో బందోబస్తు నిమిత్తం సిఐ, ఎస్సైలు అక్కడకు వెళ్లారు. వాహనాల్లో వున్న ఆందోళనకారులు వాహనాలు దిగి వెళ్లిపోయారు.

అరెస్టు చూపించాలి కాబట్టి ఏడుగురిని అదుపులోకి తీసుకుని ఒకటవనగర పోలీస్‌స్టేషన్‌కు తరలించి అనంతరం సొంత పూచీకత్తుపై వదిలిపెట్టారు. ఈ కార్యక్రమంలో వామపక్షపార్టీల నేతలు మాదాల వెంకటేశ్వర్లు, కిశోర్‌బాబు, దామా అంకయ్య, శ్రీనివాసులు, కొండయ్య తదితరులు పాల్గొన్నారు.

# వారఫలాలు

తేది 26-1-2013 నుండి 1-2-2013 వరకు మేషంలో కేతువు; వృషభంలో గురువు; తులలో శని, రాహువులు; మకరంలో రవి, బుధ, శుక్రులు; కుంభంలో కుజుడు; మిథున, కర్కాటక, సింహ, కన్యలలో చంద్రుడు సంచరిస్తారు.




కొంతకాలంగా పడుతున్న బాధలు తగ్గి ఉపశమనం లభిస్తుంది. వృత్తి, వ్యాపార ఆర్థిక లావాదేవీలు క్రమంగా పుంజుకుంటాయి. ధన లాభం. సంతోషవార్తలు వినడం, చిన్ననాటి మిత్రుల కలయిక ఉత్సాహం కలిగిస్తుంది. విద్యార్థులకు విద్యావగాహన వల్ల మనస్సంతోషం. వ్యవసాయ పనులు తిరిగి పుంజుకుంటాయి. రుణ సౌకర్యం లభిస్తుంది. సకాలంలో పనులు పూర్తవుతాయి.




అన్ని రంగాల వారికి బాగుంటుంది. ఆర్థికంగా లాభదాయకమే. తలపెట్టిన పనులలో సంతృప్తి, వ్యవహార జయం. ఉద్యోగులకు ఉన్నత స్థితి లేదా అనుకూల మార్పులుంటాయి. విద్యార్థులకు నూతన మిత్రుల వల్ల లాభాలు. వ్యవసాయదారులు పనులలో అనుకూలతలు సాధిస్తారు. కళా, క్రీడా రంగాల వారికి అధికారుల అనుగ్రహం వుంటుంది. రాజకీయులకు అధికార అనుగ్రహం వుంటుంది.




ఈ రాశి వారికి కొన్ని కీలక సమస్యలు పరిష్కారమౌతాయి. వ్యవహార జయం. వృత్తి, వ్యాపారాలలో అనుకూలతలు సాధిస్తారు. ధన లాభం. స్త్రీ సౌఖ్యం. నూతన గృహనిర్మాణాది కార్యాలలో అనుకూలతలు సాధిస్తారు. వ్యవసాయ పనులు వేగవంతమై అధిక సస్యములు సాధిస్తారు. కళా, క్రీడా రంగాల వారికి తరచూ వృత్తిపరమైన ప్రయాణాలుంటాయి.




కుజ గ్రహ మార్పుల వల్ల చేస్తున్న పనులలో ఆటంకాలు, అకారణ కోపం, ఉద్రేకాలకు లోనవ్వడం, ఇతరులతో పరుషంగా మాట్లాడుట వుంటుంది. ప్రయాణాలలో జాగ్రత్త అవసరం. భార్యాభర్తల మధ్య భేదాభిప్రాయాలుంటాయి. వృత్తి, వ్యాపారాలు బాగున్నా ఆర్థిక సామాన్యతలుంటాయి. విద్యార్థులు నూతన కార్యాచరణలపై చర్చిస్తారు. వ్యవసాయదారులకు అనుకూల వాతావరణం వుంటుంది.




తలపెట్టిన పనులన్నీ పూర్తవుతాయి. కోర్టు వ్యవహారాలు లాభిస్తాయి. ఉద్యోగులకు ఉన్నతస్థితి లేదా ప్రమోషన్లపై అనుకూల ప్రదేశాలకు మార్పులుంటాయి. వృత్తి, వ్యాపారాలు లాభిస్తాయి. నిరుద్యోగులకు ఉద్యోగ ప్రాప్తి. పాత మిత్రుల కలయిక. వ్యవహార జయం. విద్యార్థులు తమ విద్యావకాశాలను మెరుగుపరచుకొంటారు. వ్యవసాయదారులకు అనుకూలం.




గ్రహానుకూలతల వల్ల అన్ని రంగాల వారి వ్యవహారాలు క్రమంగా అనుకూలిస్తాయి. వృత్తి, వ్యాపార, ఇతర వర్గాల సంపాదన వృద్ధి. సుఖ సౌఖ్యాలు, ఇతరుల సహాయసహకారాలు లాభిస్తాయి. భూ, వాహన లాభం. విద్యార్థులకు శత్రు జయం, సంతోష వార్తలు. వ్యవసాయదారులకు వ్యవహార జయం. నూతన కార్యాలకు శ్రీకారం. కళా, క్రీడా రంగాలవారికి కుటుంబ వృద్ధి, సంతాన సౌఖ్యం.




తలపెట్టిన పనులన్నీ సకాలంలో పూర్తవుతాయి. వృత్తి, వ్యాపారాలలో అనుకూలతలు సాధిస్తారు. ఆర్థికంగా పర్వాలేదని పిస్తుంది. కుటుంబ సౌఖ్యం. వ్యవహార విజయం. మనస్సుకు తృప్తినిస్తుంది. సంతోష వార్తలు వింటారు. విద్యార్థులు నూతన కార్యాలకై చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. వ్యవసాయదారులకు ఆర్థిక పుష్టి. కళా, క్రీడా రంగాల వారికి నూతన వస్తు, వస్త్ర, భూషణ ప్రాప్తి.




గ్రహానుకూలతల వల్ల మంచి మార్పులు సాధించి, అన్ని పనులలో విజయం సాధిస్తారు. కొన్ని సమస్యలకు పరిష్కారాలు లభిస్తాయి. వృత్తి, వ్యాపారాలలో ధన లాభం. నూతన కార్యాలకై పనులు ప్రారంభిస్తారు. కళా, క్రీడా రంగాల వారు సంఘంలో పెద్దలను కలుసుకొంటారు, నూతన పరిచయాలు లాభిస్తాయి. రాజకీయులకు కొన్ని సమస్యలు తొలగి, వ్యవహారానుకూలతలు సాధిస్తారు.




సమస్యల నుండి విముక్తి కలిగి అన్ని రంగాల వారికి యోగదాయకంగా వుంటుంది. కోర్టు కేసులలో అనుకూలతలు, విజయాలుంటాయి. సంతానం వల్ల అధిక సంతోషం, అప్రయత్న లాభాలుంటాయి. వృత్తి, వ్యాపారాలు బాగుంటాయి. వ్యవసాయదారులు నూతన పనులపై శ్రద్ధ వహిస్తారు. కళా, క్రీడా రంగాల వారికి వృత్తిలో రాణింపు. రాజకీయులు అనుకున్నది సాధిస్తారు.




గ్రహస్థితిలో కొన్ని మార్పుల వల్ల అనుకోని నష్టం వున్నప్పటికీ ఆర్థికదాయం, శారీరక నలతలుంటాయి. వృత్తి, వ్యాపారాలలోని వారికి మేలు. విద్యార్థులు నూతన కార్యక్రమాలపై దృష్టి పెడతారు. వ్యవసాయదారులకు ఆర్థికాదాయం వుండి, పనులు వేగవంతమౌతాయి. కళా, క్రీడా రంగాల వారికి ఊహించని సమస్యలతో ఆర్థిక నష్టం వుంటుంది. రాజకీయులు తలపెట్టిన పనులు లాభిస్తాయి.




గ్రహానుకూలతలు లేనందువల్ల తలపెట్టిన పనులలో తరచూ ఆటంకాలు, ఆర్థిక నష్టాలు, ప్రయత్న పూర్వక ఫలితాలు రాకుండుట, శరీరారోగ్య లోపం, అసహనం వుంటుంది. వృత్తి, వ్యాపారాలలో ఆర్థికాదాయం సామాన్యంగా వుండి, ఊహించని మార్పులు చూస్తారు. వ్యవసాయదారులకు కొంత మేలు. రుణ సౌకర్యం లభిస్తుంది. కళా, క్రీడా రంగాల వారికి సరైన సమయానికి చేతికి ధనం అందుతుంది.




మీరనుకున్న పనులన్నింటిలో విజయం చేకూరుతుంది. వృత్తి, వ్యాపారాలలో రాణింపు, కుటుంబ సౌఖ్యం, స్త్రీ సౌఖ్యం, నూతన వస్తు, వాహన ప్రాప్తి. బంధుమిత్రుల సమాగమం. అయితే అధిక ధన వ్యయం, వ్యవహార నష్టాలు బాధిస్తాయి. విద్యార్థులకు అనుకూలం. వ్యవసాయదారులకు పనులలో జయం, ఆర్థికాదాయం వుంటుంది. రాజకీయులు ఇతరులతో విరోధాలు రాకుండా చూసుకోవాలి.

## పంచాంగం

26తేది రిపబ్లిక్ డే.
30తేది ఈదుల్ మాలత్. మహాత్మాగాంధీ వర్ధంతి.
31తేది సంకటహర చతుర్థి. మెహర్‌బాబా వర్ధంతి.
1తేది త్యాగరాజస్వామి ఆరాధనలు.

### శుభ ముహూర్తాలు

పుష్య మాసం శూన్య మాసం కావున వివాహాది శుభముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య వ్యవహారాలకు ముహూర్తాలున్నాయి.

### జనవరి తిథులు
### పుష్య శుద్ధ

| | | | | | |
|---|---|---|---|---|---|
| 26 | శని | చతుర్దశి | ప | 08.46 | గం.ల.వ |
| 27 | ఆది | పౌర్ణమి | ప | 10.06 | గం.ల.వ |
| 28 | సోమ | పాడ్యమి | ప | 10.59 | గం.ల.వ |
| 29 | మంగళ | విదియ | ప | 11.26 | గం.ల.వ |
| 30 | బుధ | తదియ | ప | 11.29 | గం.ల.వ |
| 31 | గురు | చవితి | ప | 11.11 | గం.ల.వ |
| 1 | శుక్ర | పంచమి | ప | 10.32 | గం.ల.వ |

అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం
7/34, దొడ్డ సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు – 2. సెల్: 95819 76599.

# వధూవర "హితకారిణీ నక్షత్ర సంఖ్యాశాస్త్ర సమ్మతములు"

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*డాక్టర్ రమేష్ — చెన్నై*

* *వధూవరులకు హితాన్నీ సఖ్యతను కలిగించే నక్షత్రాలను గురించి శాస్త్రాలు చెప్పాయా?*

'అగద మహర్షి గుణమేళన సంహిత'లో వధువు నక్షత్రం నుంచి వరుని నక్షత్రం 4, 7, 10, 13, 16, 19, 22, 25లలో ఏదో ఒకటి ఉండాలనీ, వధువు నక్షత్రం నుంచి వరుని నక్షత్రం 13వది, తర్వాతిది అయితే మంచిదని 'వైవాహిక ధర్మసూక్ష్మ గ్రంథాలు చెబుతున్నాయి.

*డి.సువర్చల — కావలి*

* *ఇంట్లో అన్నీ సమస్యలే. ఏ పనీ పూర్తి కావడం లేదు. ఎట్లా?*

జ్యోతిష, వాస్తు దోషాలున్నప్పుడు ఇదే పరిస్థితి ఎదురౌతుంది. నిర్ధారించబడిన యంత్రాన్ని శాస్త్రజ్ఞుడి ద్వారా తెప్పించుకొని ప్రతిష్టించండి.

*ఇ.నాగకుమారి — కోవూరు*

* *పశ్చిమ, దక్షిణాలలో వంటకాలువలు దోష మన్నారు. ఏం చేయాలి?*

గృహస్థుల పుట్టిన తేదీ, నామ నక్షత్రాలు, ఇంటి దిక్కులను గణించి వచ్చే యంత్రాలను దేవ గృహంలో ప్రతిష్టించుకోవాలి.

*వై.కాంతమ్మ — గూడూరు*

* *యంత్ర ప్రతిష్ట జరిగాక మూడు నెలలకే అమ్మాయి పెళ్లి కుదిరింది.*

యంత్రం మంత్ర బీజాక్షర సమన్వితం గనుక, యంత్ర ప్రతిష్ట వల్ల అన్నీ శుభాలే జరుగుతాయి.

*డాక్టర్ చక్రవర్తి — బెంగుళూరు*

* *'మత్స్యపురాణం' మీరు చదివారా? పద్దెనిమిది వాస్తు గ్రంథాలను గురించి మాత్రమే ప్రస్తావన వున్నది.*

మీరు సరిగ్గా చదవలేదు. పద్దెనిమిది సంఖ్య గ్రంథాలది కాదు. వాస్తు శాస్త్ర రచయితలది.

*బి.లావణ్యారెడ్డి — సనత్‌నగర్*

* *అమ్మాయికి చూసిన వరుడు వివరాలు పంపిస్తున్నాను. సలహా యివ్వండి?*

నక్షత్ర, లగ్నబలాలు బాగానే ఉన్నాయి. అయితే గుణమేళన యాభై శాతం పాటిస్తే చాలు.

*పి.కరుణాకర్‌నాయుడు — దిగువమాఘం*

* *తల్లితండ్రుల మరణం తర్వాత గృహ నిర్మాణం ఎప్పుడు చేయాలి?*

కర్మక్రియలు, అబ్దికం, సంవత్సరీకం తర్వాత శాంతిక్రియలు చేసి గృహ నిర్మాణం చేపట్టవచ్చు.

*వి.లక్ష్మీశారద — రాజమండ్రి*

* *వృక్షాన్ని తప్పని సరై తీసివేశాము. పరిష్కారం చెప్పండి?*

'వృక్షవేధ'తో వేగడం కష్టం. సంబంధిత యంత్ర ప్రతిష్ట చేసుకుని వంద మొక్కలను నాటి పోషించడం పరిహారమని 'మహాభృగు సంహిత' చెబుతోంది.

*టి.వి.ఆర్ — కావలి*

* *దుష్ట నక్షత్రం వల్ల అరిష్టమంట అంచేత పుట్టింటికి నన్ను పంపించారు.*

'దుష్ట నక్షత్ర అరిష్టం' అభూత కల్పన. స్వార్థపరుల కట్టుకథలు. మీరు పెద్దల చేత మధ్యస్థం చేయించి వీలుకాకపోతే మహిళా పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు చేయండి.

*టి.శ్యామలగౌరి — కందుకూరు*

* *ఐశ్వర్యాలు ధనానికి సంబంధించినవా?*

'ధర్మశాస్త్ర దుందుభి' ప్రకారం అవి జీవితానికి సంబంధించినవి. జ్ఞానం, బలం, కరుణ, ఔదార్యం వంటి గుణాలు, లక్షణాలు కూడా అష్ట ఐశ్వర్యాలలో ఋషులు కలిపారు.

*టి.జయంతి — కాకినాడ*

* *వివాహం పెద్ద సమస్యగా ఉన్నది?*

ఎలాంటి వివాహ ఆటంకాలున్నప్పటికీ రత్నం, యంత్రం, మండల పూజ నివారిస్తాయన్నది 'ధర్మ సింధు' శాస్త్ర ఉవాచం. అంచేత పరిష్కారాలు ప్రత్యామ్నాయాలు ఆచరించండి!

*ఎ.దుర్గ — విజయవాడ*

* *అతనిది 'ఆశ్లేష' నక్షత్రమట? శాస్త్ర ప్రకారం ఎలాంటి లక్షణాలుంటాయో దయచేసి చెప్పండి?*

వీరిది కన్యారాశి. నక్షత్రాధిపతి బుధుడు. శాంతం, చపలత్వం, క్రోధం అన్నీ సమపాళ్లలో ఉంటాయి. జీవితంలో ఆటంకాలున్నాసాఫీగానే జరుగుతుంది. బాల్యంలో పడిన కష్టాలు నడి వయస్సు నుండి తొలగి పోతాయి.

# జిల్లాలో ఏప్రెల్ 1 నుంచి నగదు బదలీ సాధ్యమా?

రాష్ట్ర ప్రభుత్వ అధికారులు పలు దఫాలుగా జిల్లా అధికారులతో వీడియో కాన్ఫరెన్స్ నిర్వహించి ఏప్రెల్ 1వ తేదీ నుంచి నగదు బదలీ పథకం అమలుకు అవసరమైన అన్ని ఏర్పాట్లు పూర్తి చేసుకోవాలని ఆదేశించారు. కానీ క్షేత్రస్థాయిలోని పలు సమస్యల వల్ల ఈ పథకం జిల్లాలో ఆ రోజు ప్రారంభమయ్యే అవకాశాలు కానరావడం లేదు.

**జిల్లాలో ఏప్రెల్ ఒకటి నుంచి నగదు బదలీ పథకం అమలు చేస్తామని ప్రభుత్వం ప్రకటించడంతో అధికారులు ఆ దిశగా అన్ని ఏర్పాట్లు చేస్తున్నారు. రాష్ట్రంలో ఇప్పటికే ఐదు జిల్లాలో నగదు బదలీ పథకం అమలు చేయాలని కేంద్రప్రభుత్వం నిర్ణయించింది. ఈ నేపథ్యంలో రాష్ట్రంలోని మిగిలిన జిల్లాల్లో ఏప్రెల్ ఒకటి నుంచి అమలుకు శ్రీకారం చుట్టాలని ప్రభుత్వం భావిస్తుంది. ప్రభుత్వం పలు దఫాలు అధికారులతో వీడియో కాన్ఫరెన్స్ నిర్వహించి నగదు బదలీ పథకం అమలుకు అవసరమైన అన్ని ఏర్పాట్లను పూర్తి చేసుకోవాలని ఆదేశించింది. దీంతో సబ్సిడీ పథకాలు పొందుతున్న లబ్ధిదారుల వివరాలు సేకరించేందుకు కసరత్తు ప్రారంభమైంది.**

ఇందులో భాగంగా రేషన్‌షాపు డీలర్ల ద్వారా రేషన్‌కార్డుల జాబితా రూపొందిస్తున్నారు. ప్రతి డీలర్‌కు ఒక నమూనా పత్రం అందించారు. ఈ పత్రంలో లబ్ధిదారుని పేరు, రేషన్‌కార్డు నెంబర్, ఆధార్‌కార్డు నెంబర్, బ్యాంకుఖాతా, బ్రాంచిపేరు, గ్యాస్ ఏజెన్సీల పేర్లు నమోదు చేస్తున్నారు. ఇప్పటికి ఈ ప్రక్రియ తోటపల్లి గూడూరు, ముత్తుకూరు మండలాల్లో జరుగుతోంది. మిగిలిన మండలాల్లో కూడా వెంటనే ప్రారంభించేందుకు రెవెన్యూ యంత్రాంగం ప్రయత్నిస్తుంది. నగదు బదలీ పథకం వర్తింప చేయాలంటే ప్రతి లబ్ధిదారునికి బ్యాంకు ఖాతా తప్పని సరిగా వుండాలి. అయితే గ్రామీణ ప్రాంతాల్లో బ్యాంకు ఖాతాలు లేనివారు అధికంగా వున్నారు. కుటుంబ యజమాని పేరుతోనే బ్యాంకు ఖాతాను ప్రారంభించాల్సి వుంటుంది. జీరో బ్యాలెన్స్‌తో ఖాతా ప్రారంభించేందుకు బ్యాంకు అధికారులు అంగీకరించడం లేదు.

బ్యాంకులో ఖాతాను ప్రారంభించేందుకు అధికారులు సహకరించడం లేదని లబ్దిదారులు వ్యాఖ్యానిస్తున్నారు. జిల్లాలోని అన్ని జాతీయ బ్యాంకుల్లో ఖాతాలు ప్రారంభించాలంటే బ్యాంకుల్లో అవసరమైన సిబ్బంది లేరన్నది అధికారుల వాదనగా వినిపిస్తుంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అందించే సబ్సిడీలను నగదు రూపంలో నేరుగా లబ్దిదారుని బ్యాంకు ఖాతాకు జమ చేస్తారు. పౌరసరఫరాలశాఖ, రెవెన్యూ శాఖ, ఆధార్‌కార్డు ఏజన్సీల నిర్వాహకుల నిర్లక్ష్యం కారణంగా రేషన్‌కార్డులు, ఆధార్‌కార్డుల్లో లబ్దిదారుల పేర్లు, కుటుంబసభ్యుల వివరాలు, పుట్టిన తేదీల్లో పొరపాట్లు జరిగాయి. పేర్లు సక్రమంగా లేకపోవడం, పుట్టిన తేది తప్పుగా నమోదు చేయడం వంటి తప్పులు దొర్లాయి. వీటిని సరిదిద్దేందుకు అవసరమైన సాంకేతిక పరిజ్ఞానం ప్రస్తుతం అందుబాటులో లేకుండా పోయింది.

ఈ క్రమంలో బ్యాంకులో ఖాతాను ప్రారంభించి ఆధార్‌కార్డు నెంబర్‌ను నమోదు చేయడం కష్టతరంగామారే అవకాశం వుంటుంది. అవసరమైతే గ్రామాల్లో వున్న పోస్టాఫీసుల్లో కూడా లబ్దిదారుని పేరిట ఖాతాను తెరవాలని ప్రభుత్వం ప్రకటించినా ఇది ఆచరణలో మాత్రం సాధ్యపడే అవకాశం కనిపించడం లేదు. ఎందుకంటే పోస్టాఫీల్లో ఒకరు, ఇద్దరు మాత్రమే సిబ్బంది వుంటారు. ఎక్కువ ఖాతాలను నిర్వహించడం వీరికి తలకు మించిన భారం అవుతుంది. ఇంకా ఆధార్ కార్డుల కొరకు ఫోటోలు తీయించుకోని వారు అనేక మంది వున్నారు. తగినన్ని బయోమెట్రిక్ కేంద్రాలను అధికారులు ఏర్పాటు చేయకపోవడంతో ఫోటోలు తీయించుకునేందుకు ప్రజలు ఎదురు చూస్తున్నారు. కేవలం నెల్లూరు నగరంలో ఒకే ఒక్క బయోమెట్రిక్ కేంద్రాన్ని ఏర్పాటు చేసి వున్నారు.

రెండు నెలలకోసారి ఈ కేంద్రాలలో దరఖాస్తులు అందిస్తున్నారు. ప్రతిరోజు వందల సంఖ్యలో ప్రజలు దరఖాస్తుల కోసం వచ్చి తిరిగి వెళుతున్నారు. ఈ క్రమంలో ఏప్రెల్ ఒకటి నుంచి నగదు బదలీ పథకాన్ని అధికారులు ఏ విధంగా అమలు చేస్తారో వేచి చూడాలి.

జగడం

# రెవిన్యూ సర్వీసెస్ అసోసియేషన్‌లో ఆధిపత్య పోరు!

- ఎపి రెవిన్యూ సర్వీసెస్ అసోసియేషన్ జిల్లా శాఖలో గత కొన్ని రోజులుగా ఆధిపత్య పోరు కొనసాగుతుంది. వీరు రెండు గ్రూపులయ్యే అవకాశాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి.

జిల్లా రెవెన్యూ సర్వీసెస్ అసోసియేషన్‌లో గత మూడు నెలల నుంచి ఆధిపత్యపోరు కొనసాగుతోంది. అసోసియేషన్‌లో ఏళ్ల తరబడి నేతలుగా కొనసాగుతున్నవారు ఇతరులకు అవకాశం లేకుండా చేస్తున్నారన్న ఆరోపణలున్నాయి. అసోసియేషన్ పేరుతో ఉన్నతాధికారులను బెదిరించడం, కావలసిన వారిని కోరిన ప్రాంతానికి బదలీ చేయించుకోవడం, జమా ఖర్చుల వివరాలు వెల్లడించకపోవడం వంటివి చేస్తున్నారు. అంతేకాకుండా కార్యవర్గంలోని ఇతర సభ్యుల నేతల పనితీరుపై ప్రశ్నిస్తే అమర్యాదగా వ్యవహరించడం వంటి చర్యలకు పాల్పడుతుంటారు. ఇలా వ్యవహరిస్తున్న నేతల తీరుపై రాష్ట్ర కమిటికి ఫిర్యాదులు అందడంతో పలుమార్లు పనితీరును మార్చుకోవాలని రాష్ట్రస్థాయి నేతలు సూచించినప్పటికి ఎటువంటి మార్పు కనిపించడం లేదు.

దీంతో తీవ్ర అసహనం చెందిన రాష్ట్ర రెవెన్యూ సర్వీసెస్ అసోసియేషన్ నేతలు జిల్లా కమిటీని రద్దు చేస్తున్నట్లు ప్రకటించారు. తాత్కాలికంగా కొంతమందితో అడహక్ కమిటీని ఏర్పాటు చేయడం జరిగింది. దీన్ని సహించలేని అసమ్మతివర్గం మరికొందరిని కూడ గట్టి జిల్లా కార్యవర్గానికి ఎన్నుకున్నట్లు మరో ప్రకటన జారీ చేశారు. రాష్ట్రకమిటి అనుమతి లేకుండా కార్యవర్గాన్ని ఎన్నుకోవడం నిబంధనలకు విరుద్ధమని కొందరు వాదిస్తున్నారు. తహశీల్దార్‌స్థాయి కలిగిన వారు సైతం అసమ్మతి వర్గంలో నేతలుగా చలామణి అవుతుండడం విశేషం. రాష్ట్రస్థాయి నేతలు త్వరలో జిల్లా కమిటీకి ఎన్నికలు జరపాలని సన్నాహాలు చేస్తున్న తరుణంలో అడహాక్ కమిటీని రద్దు చేయాలని కోరుతూ జిల్లా న్యాయస్థానాన్ని ఆశ్రయించారు.

అయితే అడహాక్ కమిటీని రద్దు చేసే అధికారం గానీ, స్టే విధించే అధికారంగానీ న్యాయస్థానానికి లేదని కొందరు రెవెన్యూ అసోసియేషన్ నేతలు వాదిస్తున్నారు. అసోసియేషన్‌ను అడ్డం పెట్టుకొని విధులకు డుమ్మా కొడుతూ పైరవీలకే అధిక ప్రాధాన్యతనిస్తున్న వారు వున్నారు. జిల్లాస్థాయిలో ఉపాధ్యాయసంఘాల తర్వాత ఎన్.జి.ఓ రెవెన్యూ సర్వీసెస్ అసోసియేషన్‌లు బలంగా వున్నాయి. గెజిటెడ్ స్థాయి హోదా కలిగిన వారు రెవెన్యూ అసోసియేషన్‌లో వున్నారు. రెవెన్యూ, ఎన్జీఓ సంఘాల్లో ఆధిపత్యం చెలాయిస్తున్న నేతలు జాయింట్ యాక్షన్ కమిటీని ఏర్పాటు చేసుకొని వివిధ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. కమిటీ అనుమతి లేకుండా యూనియన్ల పేరుతో కార్యక్రమాలు నిర్వహించే వారిని కొందరు జిల్లా స్థాయి అధికారులు వెనకేసుకొస్తున్నారన్న విమర్శలు వినిపిస్తున్నాయి.

గతంలో రెవెన్యూ ఉద్యోగులకు ఇళ్లస్థలాలు ఇప్పిస్తామని భారీస్థాయిలో నగదు వసూలు చేశారు. నగర శివారులోని అయ్యప్పగుడి సమీపంలో ప్రభుత్వం ఇంటి నివేశన స్థలాలు కేటాయించడం జరిగింది. సభ్యుల నుంచి వసూలు చేసిన నగదును అభివృద్ధి పేరుతో కొంతమొత్తాన్ని నేతలు దుర్వినియోగం చేశారన్న ఆరోపణలు అప్పట్లో గుప్పుమన్నాయి. యూనియన్‌లో నేతలుగా చలామణి అవుతున్నవారు నగరాన్ని వదలి ఇతర ప్రాంతాలకు బదలీపై వెళ్లేందుకు ససేమిర అంటున్నారు. ప్రధానంగా రెవెన్యూ సిబ్బంది ఆధ్వర్యంలోనే ప్రభుత్వ కార్యక్రమాలు అమలు జరుగుతుంటాయి. జిల్లా కమిటీలో తహశీల్దార్లు క్రిందిస్థాయి ఉద్యోగులు అందరూ సమానమే. బదలీల సమయంలో మాత్రం అయిన వారికి పెద్దపీట వేస్తున్నారని క్రిందిస్థాయి ఉద్యోగులు అంటున్నారు.

ఇటీవల కాలంలో జరుగుతున్న పరిణామాలను పరిశీలిస్తే భవిష్యత్తులో అసోసియేషన్‌లో రెండు గ్రూపులుగా ఏర్పడే అవకాశం లేకపోలేదని కొందరు వ్యాఖ్యానిస్తున్నారు. కేవలం సుదీర్ఘకాలం పాటు పెత్తనం చెలాయించాలన్న ఉద్దేశ్యంతోనే కోర్టును ఆశ్రయించారన్ని చెబుతున్నారు. ఇందుకు జిల్లాస్థాయి అధికారులు ఆజ్యం పోస్తున్నారన్న ప్రచారం జరుగుతోంది.



## నాగార్జునను పొగుడుతున్న అనుష్క!

పలువురికి యోగా నేర్పి ఆ తర్వాత వెండితెరపై ఒక వెలుగు వెలిగిన హీరోయిన్ అనుష్క హీరో నాగార్జునతో జతకట్టి చాలా చిత్రాల్లో నటించిన సంగతి తెలిసిందే. ఇటీవల ఇద్దరికీ చెడిందంటూ వార్తలు వచ్చాయి. అయితే అదేమీలేదని, ఇంకా ఇంకా ఆయనతో సినిమాలు చేయాలని ఉందని అంటోంది అనుష్క. పైగా ఆయన దగ్గర చాలా నేర్చుకున్నానంటుంది. రాణి రుద్రమదేవి ఇత్యాది సినిమాల్లో నటిస్తున్న సంగతి అలా ఉంచితే తెలుగు నాట ఆమె వయస్సుకు సరిపడా హీరో మాత్రం నాగ్ తప్ప ఎవరున్నారు చెప్పండి? అందుకే ఆయన్ను మంచి చేసుకోను అనుష్క అనుకూలంగా మాట్లాడుతోందంటున్నారు.

## హృతిక్ రోషన్ @ 30 కోట్లు!



హిందీ హీరోల్లో హృతిక్ రోషన్ పెద్ద మొత్తంలో పారితోషికం తీసుకొంటున్నట్లు ముంబాయిలో పెద్ద చర్చ జరుగుతుంది. హాలీవుడ్ మూవీ 'నైట్ అండ్ డే' చిత్రాన్ని రీమేక్ చేస్తుండగా ఆ చిత్రంలో నటించడానికి ఆయన అక్షరాల 30 కోట్ల రూపాయలు డిమాండ్ చేయడంతో సల్మాన్‌ఖాన్ రేటు ఒక్కసారిగా డౌన్ అయిపోయింది. యాష్ రాజ్ 'ఏక్ థా టైగర్' చిత్రానికిగాను సల్మాన్‌ఖాన్ తీసుకున్న మొత్తం 27 కోట్లు. కరణ్ జోహార్ అగ్నిపథ్ 100 కోట్ల రూపాయల మజిలీని బాక్సాఫీస్ వద్ద దాటడంతో ఆ ప్రాజెక్ట్‌లో హృతిక్ చేరిపోయాడు. దీంతో ఉన్న పళంగా రేటు 50 శాతం పెంచేశాడు. ఫాక్స్ స్టార్ స్టూడియోస్‌తో ఇప్పటికే 30 కోట్ల రూపాయల ఒప్పందం కుదుర్చుకొన్నాడు. సిద్దార్థ్ ఆనంద్ దర్శకత్వం వహించనున్న ఈ చిత్రంలో కత్రినాకైఫ్ హీరోయిన్.

## కెమిస్ట్రీ, ఫిజిక్స్‌లను నమ్మను!



తెలుగు అమ్మాయి అంజలి ప్రతిభను మనం గమనించకపోయినా తమిళ తంబీలు ఆదరిస్తున్నారు. తమిళంలో ఆమె నటించిన చిత్రాలు షాపింగ్ మాల్, జర్నీ పేర్లతో తెలుగులో అనువాదమై చక్కటి గుర్తింపు తీసుకొచ్చాయి. సంక్రాంతి రేసులో విడుదలైన సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టులో అంజలి పోషించిన సీత పాత్రకు మంచి గుర్తింపు వచ్చింది. ఈ విషయమై ఆమె మాట్లాడుతూ మంచి పాత్ర దక్కితే దానికి న్యాయం చేసేలా నటించడమే నాకు తెలుసు. నటించేది ఎవరి ప్రక్కన, కెమిస్ట్రీ ఎలా ఉంటుందో అనే సందేహంతో బుర్ర పాడుచేసుకోను. మనలో సత్తా, పాత్రకు జీవం పోయాలన్న తపన ఉంటే ఇవేవీ అవసరం లేదు. హీరో, హీరోయిన్ల మధ్య కెమిస్ట్రీ, ఫిజిక్స్‌లే సినిమాను విజయపథంలో నడిపిస్తాయనే మాటపై నాకు నమ్మకం లేదంది అంజలి.

## లేటు నరేష్!



సినిమాలను, షూటింగులను అల్లరి నరేష్ లైట్‌గా తీసుకొంటున్నట్లు ఫిల్మ్‌నగర్‌లో చర్చ జరుగుతుంది. ఆయన ఇటీవల నటించిన సుడిగాడు, యముడికి మొగుడు చిత్రాలు ఎలాగోలా కామెడీ పుణ్యమా అంటూ గట్టెక్కాయి. ఆయన సినిమా షూటింగులకు బాగా ఆలస్యంగా వస్తున్నాడట. నటించే సినిమాలను సీరియస్‌గా తీసుకోకపోవడంపై కూడా చర్చ జరుగుతుంది. ఇది హీరోల కెరీర్‌కు మంచిది కాదంటున్నారు. ఫీల్డ్‌లోని ఏకైక కామెడీ హీరో నరేష్ ఈ బాటలో నడవకుండా ఉండడం మంచిదంటున్నారు.



## కరీనాలో మార్పు!

హీరోయిన్ కరీనాకపూర్ కీలక నిర్ణయం తీసుకొంది. ఇదివరకటిలా పెళ్లి వేడుకల్లో నృత్యం చేయనంటుంది. ఇటీవలే సైఫ్ అలీఖాన్‌ను పెళ్లి చేసుకొన్న ఈ ముద్దుగుమ్మ తన మెట్టినింటి గౌరవ ప్రతిష్టల్ని దృష్టిలో పెట్టుకొని ఈ నిర్ణయం తీసుకొంటున్నట్లు ప్రకటించింది. దబాంగ్-2లో ఫెవికాల్ సే... అని సాగే ప్రత్యేక గీతంలో కరీనా నర్తించింది. ఓ పెళ్లి వేడుకలో అదే పాటకు నృత్యం చేయాలని కరీనాకపూర్‌ని కొందరు సంప్రదించారు. దీనికోసం ఆరు కోట్ల రూపాయలిచ్చేందుకు ముందుకొచ్చారు. తక్కువంటే ఎనిమిది కోట్లు ఇస్తామన్నారట. కరీనా మాత్రం ఈ అవకాశాన్ని తిరస్కరించడంతోపాటుగా ఇకపై పెళ్లి వేడుకల్లో నృత్యం చేయనని ఖరాఖండిగా చెప్పేసిందట. వాస్తవానికి పెళ్లి వేడుకల్లో నృత్యం చేయడం తారలకు ప్రధాన ఆదాయ వనరుగా మారింది. షారూఖ్‌ఖాన్, కత్రినాకైఫ్, మలైకా అరోరా, ప్రియాంక చోప్రాలు వేదికలపై నృత్యం చేస్తూ అలరిస్తుంటారు.



## నాగార్జున సరసన ఉదయభాను

ఉదయభాను మంచి టీవీ యాంకర్‌గా పేరుగాంచింది. ఈమె చిత్ర పరిశ్రమకు వచ్చిన కొత్తలో కొన్ని సినిమాల్లో హీరోయిన్‌గా నటించినా ఫలితమివ్వలేదు. దీంతో టీవీల్లో పెద్ద యాంకర్‌గా మిగిలిపోయింది. సినిమాల్లో నటించాలని ఆమెకున్న ప్రగాఢమైన కోరికతో లీడర్, జులాయి సినిమాల్లో ఐటమ్ పాటల్లో కనిపించింది. ప్రస్తుతం పూలరంగడు ఫేం దర్శకుడు వీరభద్రంతో క్లోజ్‌గా మసలుతున్న ఈమె ఆయన దర్శకత్వంలో తయారౌతున్న 'భాయ్' చిత్రంలో నాగార్జున సరసన ఓ ఐటమ్ పాటలో కనిపించనుంది. ఈ పాట తనకు మరికొన్ని అవకాశాలు తెచ్చి పెడుతుందన్న విశ్వాసాన్ని ఉదయభాను వ్యక్తం చేసింది.

## కోటిన్నరకు తమన్నా!



మిల్క్ బ్యూటీ తమన్నా తాను తీసుకునే రెమ్యునరేషన్‌లో రికార్డు బద్దలు కొట్టింది. కుర్రకారులో ఆమెకు మంచి క్రేజ్ ఉండడం కూడా రెమ్యునరేషన్ బాగా పెరిగేందుకు దోహదపడింది. గతంలో ఇలియానా, నయనతార కోటి రూపాయలు రెమ్యునరేషన్ తీసుకున్న హీరోయిన్లుగా రికార్డు నెలకొల్పారు. ఆ రికార్డును తమన్నా ఇటీవల క్రాస్ చేసింది. తమిళంలో అజిత్ సరసన నటించను ఆమె కోటిన్నర రూపాయలు అడిగిందట. కానీ ఈ చిత్ర నిర్మాత మరో ఆలోచన చేయకుండా ఒప్పుకొన్నాడట. తెలుగులో మాత్రం ఆమె కాస్త మొత్తం తగ్గిస్తుందంటున్నారు. ఇక్కడా రెండు హిట్లు పడితే ఈ మొత్తం పెంచేస్తుందంటున్నారు. తమన్నానా... మజాకా?

## హవీష్ సొంత సినిమాలు



ఈ మధ్య విడుదలైన జీనియస్ చిత్రానికి పేరుకు దాసరి కిరణ్ నిర్మాత అయినా డబ్బులు పెట్టింది మాత్రం హీరో హవీష్ అని కృష్ణానగర్ మొత్తం కోడైకూస్తుంది. బాగా డబ్బులున్న హవీష్‌కు హీరోగా ఓ రేంజ్‌కి చేరిపోవాలని ఉబలాటమట. రవిబాబు ఇతనితో తీసిన 'నువ్విలా' సినిమాలో కూడా ఎదురు డబ్బులు కట్టి వేషం సంపాదించాడని టాక్. హవీష్ తండ్రి కొడుకు ముచ్చట తీర్చను జీనియస్ కోసం 12 కోట్ల రూపాయలు ఖర్చు పెట్టాడు. డబ్బుపోయినా పరిశ్రమలో తన కొడుకు హీరోగా నిలబడాలన్న ఆయన కోరిక ఇప్పుడప్పుడే తీరేలా లేదు.

## బికినీలో స్నేహాఉల్లాల్



కాలు మడతబడి బెడ్‌కు పరిమితమైన పిల్లి కళ్ల హీరోయిన్ స్నేహాఉల్లాల్ కోలుకొంది. అల్లరి నరేష్, కిక్ శ్యామ్, వైభవ్, రాజు సుందరం కాంబినేషన్‌లో దూకుడు చిత్ర నిర్మాత సుంకర అనిల్ త్రీడీలో తీస్తున్న యాక్షన్ సినిమాలో నటించను ఒప్పుకొంది. దీనిలో స్నేహాఉల్లాల్ బికినీ సూట్‌లో కనిపిస్తుందట. ఈ సన్నివేశంలో వేడిగా కనిపించను బాడీని షేప్ చేసుకోను ఇప్పటి నుంచే వర్కవుట్లు మొదలు పెట్టినట్లు సమాచారం. ఉల్లాసంగా ఉత్సాహంగా, సింహా వంటి విజయవంతమైన చిత్రాల్లో నటించినా స్నేహాకు తెలుగులో బ్రేక్ రాలేదు పాపం.



## నయనతారకు డబ్బు పిచ్చి!

ప్రభుదేవాను పెళ్లి చేసుకోక ముందే నయనతార ప్రేమ పెటాకులైంది. దీంతో మళ్లీ నటనలో ఆమె బిజీ అయ్యింది. పెళ్లి కోసమని నయనతార కొన్ని ఆఫర్లు మిస్సయ్యింది. అప్పుడు మిస్ అయిన వాటిని వడ్డీతో సహా ఇప్పుడు రాబట్టుకోవాలని కాబోలు వచ్చిన ప్రతి ఛాన్స్‌ని ఒప్పుకొంటుంది. తెలుగు, తమిళ భాషల్లో ఎడాపెడా సినిమాలు ఒప్పుకొంటున్న నయనతార హీరో ఎవరనేది కూడా పట్టించుకోవడంలేదు. క్యాష్ డౌన్ క్యారీ అనే పద్ధతి ఫాలో అయిపోతుంది. ఐటమ్ గాళ్‌గా కూడా నటించడానికి అభ్యంతరం లేదంటుంది. దీంతో రెండేళ్లపాటు నయనతార డైరీ ఖాళీ లేకుండా నిండి పోయిందంటున్నారు.

● ఔట్ పోస్టు

# పోలీసుల దండకాలు!

తిరిగే కాలు, తిట్టే నోరు ఊరకే ఉండదన్న చందంగా ఉంది టోల్‌గేట్ల వద్ద ఏర్పాటు చేసిన పోలీస్ ఔట్ పోస్టు సిబ్బంది వ్యవహారం. దోపిడీలు, దొంగతనాలు, ఇతరత్రా నేరాలను అరికట్టేందుకు, నేరస్తులను పట్టుకొనేందుకు ఎస్పీ ఇటీవల టోల్ గేట్ల వద్ద పోలీస్ ఔట్ పోస్టులు ఏర్పాటు చేసి, సిబ్బందికి విధులు కేటాయించారు. లంచాలకు, అవినీతికి అలవాటు పడిన సిబ్బంది కొందరు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొనేందుకు తమ చేతివాటాన్ని ప్రదర్శిస్తుండడంతో వివిధ ప్రాంతాలకు రాకపోకలు సాగించే పోలీసుల కారణంగా ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. వీరు టోల్‌గేట్ల వద్ద కూర్చొని వచ్చేపోయే ద్విచక్ర వాహనాలను ఆపి కాగితాలు పరిశీలించే నెపంతో అందినంత దండుకొంటున్నారు. వాహనానికి సంబంధించి అన్ని కాగితాలు సరిగా ఉన్నప్పటికీ యాభై, వంద రూపాయలు వసూలు చేస్తున్నారట. ఇక కోళ్ల లోడ్‌తో వెళ్లే వాహనాలు, కూరగాయల లోడ్‌తో వెళ్లే వారి వద్ద నుంచి ఇంటి అవసరాలకు కూరలు, డబ్బులు దండేస్తున్నారట. ఆటోల వారి వద్ద నుంచి వసూళ్లు సరే సరి. వివిధ వ్యవసాయ పనులపై వచ్చే రైతులు, పాల వాహనాలు ఇలా దేన్నీ వదలకుండా దండకాలు సాగిస్తూ ఎవరైనా ప్రశ్నిస్తే ఎస్పీ పేరు చెప్పి దబాయిస్తుండడంతో నేరస్తుల సంగతి ఎలా ఉన్నా సామాన్యులు మాత్రం ఈ ఔట్ పోస్టు పోలీసు సిబ్బంది కారణంగా జేబులు ఖాళీ చేసుకోవాల్సి వస్తోంది. ఎస్పీ గారు సదుద్దేశంతో వీటిని ఏర్పాటు చేసినా పోలీసు సిబ్బంది బుద్ధి మారకపోవడంతో ఇది మంచి ఆదాయ వనరుగా మారింది. దీనిపై దృష్టి సారించి లంచాలు తినడం మరిగిన పోలీసుల పని పట్టాలని పలువురు కోరుకొంటున్నారు.

**వీరింతే...**

# డాబాల్లో మద్యం సేవించడంపై నిషేధం

సంక్రాంతి పండుగ వరకు రహదారులు వెంబడి ఉన్న డాబాల్లో మద్యం విక్రయాలు జరిపేవారు. ఏ కారణం చేతనో తెలియదుకానీ మద్యం విక్రయాలు, సేవించడాన్ని నిలిపి వేయడం జరిగింది. నెల్లూరు నగరానికి సమీపంలో ఉన్న జాతీయ రహదారితోపాటు వివిధ ప్రాంతాలకు వెళ్లే రహదారులకు ఇరువైపులా డాబాలు ఏర్పాటై ఉన్న సంగతి తెలిసిందే. గత వారం రోజుల నుంచి డాబాల్లో మద్యం సేవించరాదంటూ పోలీసులు ఆదేశాలు జారీ చేసినట్లు తెలిసింది. మొన్నటి వరకు డాబాలు, వాటి ప్రక్కనే ఉన్న బ్రాందీ షాపుల నుంచి సంబంధిత పోలీస్ స్టేషన్ సిబ్బందికి నెలసరి మామూళ్లు అందుతుండేవి. దీంతో రాత్రి 12 గంటల వరకు డాబాల్లో మద్యం విక్రయం సేవించడాలు జరిగేవి. ఉన్నతాధికారుల ఆదేశాల మేరకు డాబాల్లో మద్యం సేవించేందుకు ఏర్పాట్లు చేస్తే కేసులు నమోదు చేస్తామని పోలీసులు హెచ్చరించినట్లున్నారు. దీంతో డాబాలు వెలవెలపోతున్నాయి.

# అభిమాని జరిపిన జన్మదినం!


ఎన్టీఆర్ ఫ్లెక్సను ఆసక్తికరంగా చూస్తున్న అభిమానులు.

మాజీ ముఖ్యమంత్రి దివంగత ఎన్టీ రామారావు 17వ వర్ధంతి వేడుకలను నగరంలో ఘనంగా నిర్వహించి నివాళులు అర్పించారు. మాజీ మంత్రి, అఖిల భారత ఎన్టీఆర్ అభిమాన సంఘాల అధ్యక్షుడు తాళ్లపాక రమేష్‌రెడ్డి ఆధ్వర్యంలో ప్రతి ఏడాది లాగే ఈ సంవత్సరం నర్తకి సెంటర్‌లో ఎన్టీఆర్ వివిధ సినిమాల్లో పోషించిన పాత్రల నిలువెత్తు కటౌట్లు ఏర్పాటు చేశారు. శ్రీ కృష్ణుడి గెటప్‌లో ఉన్న కటౌట్ పలువురిని ఆకట్టుకొంది. కళాంజలి ఆర్కెస్ట్రా ఆధ్వర్యంలో రామారావు సినిమాల్లోని పాటలతో పాట కచ్చేరి నిర్వహించారు. తెలుగుదేశం పార్టీ ఆధ్వర్యంలో ఎన్టీఆర్ విగ్రహానికి పూలమాలలు వేసి నివాళులు అర్పించిన పలువురు నేతలు తెలుగు జాతి గౌరవానికి, రాష్ట్రాభివృద్ధికి ఎన్టీఆర్ చేసిన సేవలను గుర్తు చేసుకొన్నారు. సమాజమే దేవాలయం అంటూ పేదల కోసం పార్టీని స్థాపించి చివరి వరకు వారి అభ్యున్నతికి పాటుపడిన వ్యక్తి ఎన్టీఆర్ అని శ్లాఘించాడు తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర.

# ఇసుక రీచ్‌లకు 28న లాటరీ!

● పెద్ద సంఖ్యలో టెండర్లు దాఖలు

జిల్లాలోని ఎనిమిది ఇసుక రీచ్‌లకు ఈ నెల 28వ తేదీన లాటరీ తీయనున్నారు. మన జిల్లాకు చెందిన కాంట్రాక్టర్లతోపాటు ఇతర జిల్లాలకు చెందిన కాంట్రాక్టర్లు కూడా ఇసుక రీచ్‌లకు టెండర్ దాఖలు చేశారు. గొల్ల కందుకూరు, పొట్టేపాళెం, విరువూరు, పడమటి కంభంపాడు, పల్లిపాడు, మహ్మదాపురం, అప్పారావుపాళెం, మినగల్లు తదితర ఇసుక రీచ్‌లకు టెండర్లు ఆహ్వానించారు. వీటి గడువు ఈ నెల 18వ తేదీతో ముగిసింది. చివరి రోజున అధికారికంగా టెండర్లు దాఖలు చేసేందుకు కాంట్రాక్టర్లు డ్వామా కార్యాలయానికి తరలి రావడంతో గందరగోళం ఏర్పడింది. సమయం మించినా కూడా టెండర్ వేసేందుకు అధికారులు అనుమతివ్వడం ఉద్రిక్తతకు దారి తీసింది. దీంతో పోలీసులు రంగ ప్రవేశం చేసి గొడవ పడుతున్న కాంట్రాక్టర్లను బయటకు పంపాల్సి వచ్చింది. మొన్నటి వరకు భూగర్భ, గనుల శాఖ ఆధ్వర్యంలో ఇసుక రీచ్‌ల వేలంపాటలు జరిగేవి. తొలిసారిగా జిల్లా నీటి యాజమాన్య సంస్థ(డ్వామా)కు వీటి బాధ్యతలను ప్రభుత్వం అప్పగించింది. ఈ కార్యాలయ అధికారులు, సిబ్బందికి వీటి నిర్వహణ పట్ల అవగాహన లేకపోవడంతో టెండర్లు దాఖలు చేసే సమయంలో ఇబ్బందులు తలెత్తాయి. 28వ తేదీన ఎనిమిది ఇసుక రీచ్‌లకు దాఖలైన టెండర్లను లాటరీ తీయనున్నారు. ఐదు వేల రూపాయలు చెల్లించి టెండర్ వేసిన వారికి లాటరీ ద్వారా ఇసుక రీచ్ దక్కితే కోట్ల రూపాయలు ఆదాయం గడించవచ్చని పలువురు కాంట్రాక్టర్ల ధీమా.

# "ఆధార్" లేకున్నా దరఖాస్తుకు అనుమతి!

కేంద్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో జిల్లాలో 9, 10 తరగతులు చదువుతున్న బాల, బాలికలకు ఉపకార వేతనాలు మంజూరుకు అధికారులు శ్రీకారం చుట్టారు. ప్రభుత్వ సంక్షేమ వసతి గృహాల్లో ఉన్న విద్యార్థులతోపాటు, ఇంటి నుంచి పాఠశాలకు వెళుతున్న వారు కూడా ఉపకార వేతనానికి దరఖాస్తు చేసుకోవచ్చు. కొత్తగా ప్రవేశపెట్టిన ఈ పథకాన్ని 2012 – 13 సంవత్సరం నుంచి అమలు చేయాలని ప్రభుత్వం ఆదేశించింది. ఇందుకు దరఖాస్తు చేసుకోవాలంటే 9, 10 తరగతులు చదివే బాల, బాలికలు ఆధార్ కార్డు కలిగి ఉండాలన్న నిబంధన తొలుత విధించారు. అయితే జిల్లాలో ఇప్పటికి ఆధార్ కార్డు తీసుకోని వారు 60 శాతం మంది ఉన్నారు. ఆధార్ నిబంధనతో దరఖాస్తు చేసుకోలేని వారు అధికంగా ఉండడంతో ప్రభుత్వం కొంత సడలింపు ఇచ్చింది.

# వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి వితరణ!

## జగన్నాథ యాత్ర భక్తులకు ప్రసాద వితరణ



దానధర్మాలు చేయడంలో తనకు తానే సాటని నిరూపించుకున్న ప్రముఖ పారిశ్రామికవేత్త వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి వితరణ పరంపర కొనసాగుతూనే ఉంది. 19వ తేదీ నగరంలో జరిగిన జగన్నాథ రథయాత్రకు పెద్ద సంఖ్యలో తరలి వచ్చిన భక్తుల ప్రసాద వితరణ కోసం రెండు లక్షల రూపాయల మొత్తాన్ని ఇస్కాన్ సిటీ కృష్ణ మందిర నిర్వాహకులు సుఖదేవస్వామికి ఆయన అందజేశారు. గత యేడాది కూడా ఆయన జగన్నాథ భక్తులకు ఆర్థిక సహాయం ప్రకటించారు. వీటితోపాటు ఇస్కాన్ నేతృత్వంలో గోశాల నిర్మాణానికి కూడా తనవంతు సహాయమందించారు. వీటితోపాటు వివిధ పాఠశాలలకు భోజనాల రవాణా నిమిత్తం మ్యాక్స్ పికప్ వాహనాన్ని కూడా వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి అందించారు. జగన్నాథ రథయాత్ర ప్రారంభోత్సవం సందర్భంగా వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి మాట్లాడుతూ జగన్నాథుని కృపాకటాక్ష వీక్షణాలు భక్తులపై ప్రసరించాలని మనసారా ఆకాంక్షించారు.

# గుర్తింపులేని స్కూళ్ల నివేదిక బుట్టదాఖలు!

పాఠశాలల గుర్తింపు వ్యవహారం జిల్లా విద్యాశాఖాధికారికి, స్కూలు కరస్పాండెంట్ల మధ్య ఉప్పు నిప్పులా మారింది. విద్యాశాఖాధికారి కొన్ని స్కూళ్ల యాజమాన్యాలకు కొమ్ముకాస్తున్నాడని, వారు ఇబ్బడిముబ్బడిగా పాఠశాలలు నెలకొల్పుకొని నిర్వహించేకొనేందుకు అండగా నిలుస్తున్నాడని పలువురు కరస్పాండెంట్లు ఉన్నతాధికారులకు ఫిర్యాదు చేశారు. దీనిపై తగిన స్పందన లేకపోవడంతో న్యాయస్థానాన్ని ఆశ్రయించడంతో ఇద్దరి నడుమ జరుగుతున్న వివాదం తారాస్థాయికి చేరుకొంది. జిల్లాలో ప్రభుత్వ గుర్తింపులేని పాఠశాలలను మూసివేయాలని చాలాకాలంగా ప్రైవేట్ స్కూళ్ల యాజమాన్యాలు ఆందోళన చేస్తున్నాయి. ఒక దశలో రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి వద్దకు మధ్యస్థానికి వెళ్లింది. కొద్దికాలం చల్లబడినా జిల్లా విద్యాశాఖాధికారి వ్యవహారశైలితో ఈ వివాదం మళ్లీ రాజుకొంది. కొన్ని పాఠశాలల యాజమాన్యాలు ఒక పాఠశాల గుర్తింపుతో లెక్కకు మించి పాఠశాలలను గుర్తింపు లేకుండా నిర్వహిస్తుండడంపై విద్యాశాఖ చర్యలు చేపట్టక పోవడంతో కొందరు కరస్పాండెంట్లు న్యాయస్థానంలో కేసు దాఖలు చేశారు. దీనికితోడు విద్యాశాఖాధికారి కొన్ని పాఠశాలల యాజమాన్యాలకు అండగా ఉండడం, వారి వాహనాలను సొంతానికి వాడుకోవడం, వాటిల్లోనే తిరుగుతుండడంతో స్కూలు యాజమాన్యానికి, అధికారికి మధ్య ఉన్న ధన సంబంధం బట్టబయలైంది. ఈ నేపథ్యంలో గత నెలలో డిఇఓపై వచ్చిన ఫిర్యాదుపై గుంటూరు ఆర్‌జెడి విచారణ చేపట్టడం, ఆరోపణలు వస్తున్న పాఠశాలలను తనిఖీ చేయడం జరిగింది. ఆమె తనిఖీల్లో అక్రమాలు బయటపడ్డాయి. దీనిపై ఉన్నతాధికారులకు నివేదిక సమర్పించినా అవి బుట్టదాఖలైనట్లు తెలుస్తోంది. పైస్థాయి అధికారి నుంచి తగిన ఆదేశాలు రాకపోవడంతో డిఇఓపై వచ్చిన ఆరోపణలపై రుజువులున్నప్పటికీ చర్యలు లేకపోవడంతో విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.

**చక్రం తిప్పిన డిఇఓ**

# సర్వేయర్లపై జెసి ఆగ్రహం

జిల్లా జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం సర్వేయర్ల పనితీరుపై తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. ఇటీవల జిల్లా సర్వే అండ్ రికార్డ్సు అధికారులతో సమీక్షా సమావేశం జరిగింది. ఈ సమావేశంలో పాల్గొన్న జాయింట్ కలెక్టర్ భూములకు సంబంధించిన రికార్డులు, కొలతలు వేయడం, రైతులకు హద్దులు చూపించడంలో నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నట్లు ఫిర్యాదులు అందుతున్నాయని మండి పడ్డారు. మండల స్థాయిలో ప్రభుత్వ భూములను గుర్తించి వాటి పరిరక్షణ కోసం సంబంధిత తహశీల్దార్లకు తెలియజేయాలన్నారు. రైతులు తమ భూముల హద్దులు చూపించమని దరఖాస్తు చేసిన తర్వాత వెళ్లి హద్దులు నిర్ణయించాలన్నారు. సర్వేయర్లు సకాలంలో స్పందించక పోవడంతో గ్రామీణ ప్రాంతాల్లో రైతుల మధ్య వివాదాలు చోటుచేసుకునే ప్రమాదం ఉందన్నారు. దీంతోపాటు 6వ విడత భూపంపిణీ చేసిన భూములను లబ్ధిదారులకు చూపించాలని ఆయన కోరారు. సర్వేయర్ల కొరత ఉంటే బయట ఏజెన్సీల నుంచి అవసరమైన వారిని నియమించుకునేందుకు చర్యలు తీసుకోవాలని సూచించారు.

## తేలిపోయిన తెలంగాణ బూచి!

మొదటి పేజీ కొరవ

ణానికి వేల కోట్ల రూపాయలు వెచ్చించవలసి వస్తుంది కాబట్టి బడ్జెట్ మీద మోయలేని భారం పడుతుందన్న ఆలోచన. అయితే సోనియాగాంధీకి మాత్రం తెలంగాణ ఇవ్వాలని వుందని చెప్తారు. 2004 ఎన్నికల ప్రణాళికలో తన పేరుతో ఇచ్చిన హామీ తాను వుండగానే అమలు చేయాలన్నది. ఆమె అభిలాష అని చెప్పున్నారు.

ఇదిట్లా వుంటే రాహుల్ గాంధీ మాత్రం చిన్న రాష్ట్రాలకు అనుకూలుడన్నది అందరికీ తెలిసిన నిజం. నాయకత్వ శిక్షణలో భాగంగా ఆయన గత ఎనిమిదేళ్లుగా పలువురు మేధావులు, ప్రపంచ స్థాయి ఆర్థికవేత్తలు, పరిపాలనలో తలలు పండిన వారు, పేదరిక నిర్మూలన కార్యక్రమాలలో నిష్ణాతు లైన సమాజ సేవకుల సహచర్యంలో గడుపుతు న్నాడు. ఈ క్రమంలో అమెరికాలో వలె ఇక్కడా రాష్ట్రాల సంఖ్య 50 వరకు పెంచాలనే ప్రతిపాదన వచ్చిందట. అది రాహుల్‌కి నచ్చింది. చిన్న రాష్ట్రాల వల్ల ఆయన దృష్టిలో రెండు ఉపయోగాలు. మొద టిది, ప్రజలకు ప్రభుత్వం మరింత చేరువ కావడం. రెండవది – చిన్న రాష్ట్రాల నుంచి పుట్టుకొచ్చే ప్రాం తీయ పార్టీలకు కేంద్రంలో ఎటువంటి బలం, బలగం లేక జాతీయ పార్టీల క్రింద అణిగి మణిగి వుండే పరిస్థితి ఏర్పడడం. రాజకీయంగా తన వంటి జాతీయస్థాయి నేతలకు పెద్ద రాష్ట్రాల నుంచి వస్తున్న ములాయం, లల్లూ, నితీష్, మాయావతి, జగన్ వంటి ప్రాంతీయ పార్టీ నేతలతో పెద్ద సవాళ్లు ఎదురౌతున్నాయి. అటువంటి నేతల పరిధి, ప్రభావం చిన్న చిన్న రాష్ట్రాలకు పరిమితం చేస్తే జాతీయ స్థాయిలో పోటీ వుండదన్నది రాహుల్ అభిప్రాయం.

అయితే ఈరోజు పార్టీ పగ్గాలు చేపట్టి, రేపు పొద్దునే తెలంగాణ వంటి వివాదాస్పద నిర్ణయం తీసుకోవడానికి రాహుల్ గాంధీ సిద్ధంగా లేరు. మరికొంత కాలం వేచి చూడాలని భావిస్తున్నాడట ఆయన. రాహుల్ గాంధీ నాయకత్వానికి తెలంగాణ అంశం ఒక పెను సవాలుగా నిలవబోతున్నదన్నది నిజం. ఈ సమస్యను ఎంత తెలివిగా సానుకూలంగా పరిష్కరిస్తే ఆయన నాయకత్వ ప్రతిష్ట అంతగా పెరుగుతుంది. ఇందులో విఫలమైతే అదీ పతనమౌ తుంది.

కారణం ఏదైతేనేమి, తెలంగాణ అంశం మరొకసారి కోల్డ్ స్టోరేజీకి చేరిపోయింది. తమ ఒత్తిడి ఫలితంగానే కేంద్రం వెనక్కు తగ్గిందని సీమాంధ్ర నేతలు చంకలు గుద్దుకొంటున్నారు. గత వారం రోజులుగా సీమాంధ్ర నుంచి మంత్రులు, ఎమ్మెల్యేలు వెళ్లి ఢిల్లీలో గోల చేసి వచ్చిన మాట నిజం. ఈ నాటకం నడిపించిన వాడు కెవిపి రామ చంద్రరావు. వైఎస్ మరణం తర్వాత తెర వెనుక తచ్చాడుతుండిన కెవిపి ఢిల్లీ పెద్దల ముందు తన బలం ఏమిటో ప్రదర్శించి చూపాడు. దాదాపు 80 మంది ముఖ్యనేతలను తన వెనుక నడిపించాడు. ఇందులో ఆయన ఉద్దేశం కేవలం తెలంగాణను అడ్డుకోవడమేనా లేక భవిష్యత్తులో రాష్ట్ర కాంగ్రెస్‌కు సంబంధించిన నిర్ణయాలలో తన పాత్రను సుస్థిరం చేసుకోవడమా అన్నది అర్థం కావడం లేదు.

ఇప్పుడు తెలంగాణలో ఏమి జరగబోతుం దన్నది ప్రశ్న. కెసిఆర్ అప్పుడే సమర ఢమరుకం మ్రోగించాడు. కాంగ్రెస్ కొంప ఖాళీ చేసి తనలో కలిసిపొమ్మని పిలుపు ఇచ్చాడు. జెఎసి ఛైర్మన్ కోదండరాం కూడా చరిత్ర ఎరుగని పోరాట పంథా అవలంభిస్తామని ప్రకటిస్తే, కోమటిరెడ్డి వెంకటరెడ్డి వంటివారు మిలిటెంట్ ఆందోళన గురించి మాట్లాడు తున్నారు. మొత్తం మీద తెలంగాణలో మళ్లీ రచ్చ మొదలు కాక తప్పదు. 2014 ఎన్నికల వరకు ఆ రావణ కాష్టం కాలుతూనే వుండబోతుంది.

రెడ్డి ఆవేదన చెందారు. ఎన్టీఆర్ 17వ వర్ధంతి సం దర్భంగా జరిగిన కార్యక్రమంలో ఆయన తన బాధను వెళ్లగక్కారు. ఎన్టీఆర్ అభిమానిగా తనను రాజకీయ ప్రవేశం సందర్భంగా విమానంలో ఎక్కించుకొని పోయాడని ఆనాటి సంగతులను గుర్తు చేసుకొన్న ఆయన శాసన సభ ఎన్నికల్లో ప్రజలు ఓటువేసి గెలి పించకపోవడం పట్ల కన్నీళ్ల పర్యంతం అయ్యారు. ఈ విషయమై ప్రజలను కలసి ప్రశ్నిస్తానన్నారు రమేష్‌రెడ్డి.

## బిజీగా బ్లాక్ ఫిల్మ్‌ల వ్యాపారం

బ్లాక్ ఫిల్మ్‌లు వాహనాలకు తొలగించాలని కోర్టు ఆదేశించడంతో పోలీసులు ఆ పనిలో పడ్డారు. బ్లాక్ ఫిల్మ్‌తో తిరిగే వాహనాలను నిలిపి 500 రూపాయలు ఫైన్ వేయడంతోపాటు ప్రక్కనే స్టిక్కర్ అంగళ్ల వారిని పెట్టుకొని ఫిల్మ్‌లు తొలగిస్తున్నారు. ఇందుకు అదనంగా మరో 300 రూపాయలు వసూలు చేస్తున్నారు. దీంతో పలు వాహనాల యజ మానులు బ్లాక్ ఫిల్మ్ తీయించి వేసేందుకు స్టిక్కర్ల వ్యాపారులను, డెకరేషన్స్ షాపులకు వెళ్తుండడంతో వారు ఆ పని చేసినందుకు 300 నుంచి 500 రూపా యలు వసూలు చేస్తున్నారు. పోలీసు బాధ భరించ లేక అందరూ ఆ పని చేస్తుండడంతో వ్యాపారులకు మంచి ఆదాయం తెచ్చే కార్యక్రమంగా మారింది.

## స్కూటర్ ర్యాలీతో సోమిరెడ్డికి స్వాగతం

తెలుగుదేశం పొలిట్‌బ్యూరో సభ్యునిగా నియ మితులై నెల్లూరు వచ్చిన సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డికి ఒట్టూరు సంపత్‌రాజు స్కూటర్ ర్యాలీతో స్వాగ తం పలికారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి భవిష్యత్తులో మరింత పెద్ద పదవులు పొందాలని, ఆయన నేతృత్వంలో జిల్లాలో తెలుగుదేశంపార్టీ విజయపరంపర కొన సాగుతుందన్న ఆకాంక్ష వ్యక్తం చేశారు.

## మరణం

నెల్లూరు దర్గామిట్ట సరస్వతినగర్ వాసి యిన్న మూరి పార్వతీదేవి (85) 23వతేది మరణించారు. ట్రంకురోడ్డులో విమల్‌జంక్షన్ షోరూం నిర్వాహ కుడు ఉదయభాస్కర్, ప్రస్తుతం ఎల్‌ఐసిలో అడ్వైజ ర్‌గా పని చేస్తున్న వెంకటేశ్వరరావు కూడా ఈమె కుమారులే. వీరిద్దరుగాక మరో ముగ్గురు కుమా రులు, కుమార్తె కూడా ఉన్నారు. మాతృమూర్తిని కోల్పోయిన వీరి కుటుంబానికి మా సానుభూతి.

## వివేకాకిక విశ్రాంతేనా?

మొదటి పేజీ కొరవ

బాధలో వుండే మనిషిని వివాదాలలోకి లాగడం మన ఆనవాయితీ కాదు. ఆ సభ్యతకు వెరచి పూర కుండ వలసి వస్తున్నదే తప్ప మరొక సందర్భం అయి వుంటే ఆనం రామనారాయణరెడ్డి చేసిన ఈ మార్పుల పట్ల మా అభిప్రాయాన్ని నిక్కచ్చిగా చెప్పే అవకాశం కలిగేది. ఒక్కమాట మాత్రం చెప్పక తప్పదు. రామ నారాయణరెడ్డి చేసిన పని తప్పు. ఇప్పటికైనా చూరు క్రింద వేలాడే గబ్బిలాల వలె విఆర్ కాలేజీని పట్టు కోవడం మానుకొని, ప్రజాస్వామ్యబద్ధంగా ఎన్నికలు జరిపి, కొత్త కార్యవర్గాన్ని నియమించడం మంచిది. లేకుంటే ఆ కాలేజీ పాడుపడి పోతుంది.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

రాహుల్ గాంధీ నియామకాన్ని స్వాగతిస్తూ ఆనం రంగమయూర్‌రెడ్డి నేతృత్వంలో నగరంలో ర్యాలీ నిర్వహించారు. గాంధీ, ఇందిరా గాంధీ విగ్రహాలకు పూలమాలలు వేసి నివాళులర్పించారు. ఇందిరా భవన్‌లో కేక్ కట్ చేసి యూత్ కాంగ్రెస్, ఎన్ఎస్‌యూఐ కార్యకర్తలకు పంచిపెట్టారు.

## గ్రామ రెవిన్యూ అధికారుల సంఘం క్యాలెండర్!

జిల్లా గ్రామ రెవిన్యూ అధికారుల సంఘం క్యాలెండర్‌ను కలెక్టర్ క్యాంపు కార్యాలయంలో జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్ రెడ్డి 17వ తేది ఆవిష్కరించారు. ఈ కార్య క్రమంలో ఆంధ్ర ప్రాంత గ్రామ రెవిన్యూ అధికారుల సంఘం అధ్యక్షులు పంట అశోక్‌కుమార్ రెడ్డి, జిల్లా కార్యదర్శి దారా రమణయ్య, కాకుటూరు శ్రీహరి, నాగరాజు, దూదల వెంకయ్య, పివిఎస్‌సోమ యాజులు, పి.రాజగోపాల్, తిరుపతి, జనార్దన్, తిరు పాలురాజు, నాగిరెడ్డి, చలపతి, పెంచలమ్మ, చిన్నా, రమణారావు పాల్గొన్నారు.

## వైఎస్‌కు నాడు విమాన టిక్కెట్లకు డబ్బులు లేవు

వైఎస్ రాజశేఖర్‌రెడ్డి నెల్లూరు వస్తున్న సంద ర్భంలో విమాన టిక్కెట్లకు డబ్బులు లేకపోతే తాము ఖర్చు భరించి ఇక్కడకు తీసుకు వచ్చామని టిడిపి నేత కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి తెలిపారు. ఆనాడు కాంగ్రెస్‌లో ఉండగా జరిగిన విషయాలను ఎన్టీఆర్ వర్ధంతి సభలో గుర్తు చేసుకొన్నారు. అలాంటి వైఎస్‌కు ముఖ్యమంత్రి కాగానే వేల కోట్ల రూపా యలు ఎక్కడ నుంచి వచ్చాయో జగన్ జవాబు చెప్పాలన్నారు. నైతిక విలువలకు కట్టుబడిన పార్టీ తెలుగుదేశం పార్టీ అన్నారు.

## నాకు ఎందుకు ఓటు వేయలేదు

ఎన్టీఆర్ పెట్టిన భిక్షతో రాజకీయాలలోకి వచ్చిన తనకు నగర ప్రజలు ఎందుకు ఓటెయ్యలేదో తెలీడం లేదని మాజీ మంత్రి, టిడిపి నేత టి.రమేష్

## సహకార సంఘాల ఎన్నికలు!

5వ పేజీ కొరవ

దింపులు జరిపాడు. వారెవరూ అభ్యర్థి పేరు సూచిం చక పోవడంతో, తన ఆత్మీయ కుటుంబంలోని అతి ముఖ్యుడైన రియల్ ఎస్టేట్ వ్యాపారి మెట్టుకూరు ధనుంజయరెడ్డిని సెంట్రల్ బ్యాంక్ అధ్యక్షుడిగా ముగ్గు లోకి తెచ్చాడు. ధనుంజయరెడ్డి అత్యంత స్థితిపరు డని చెప్తారు. ఎన్నిక కోసం ఎంత ఖర్చయినా పెట్టు కోగల స్తోమత వుందట. 2009 శాసనసభ ఎన్నిక లలో ఆ యువకుడికి ఎక్కడో ఒక చోట కాంగ్రెస్ టిక్కెట్ ఇప్పించాలని కూడా చూశాడు రామనారా యణరెడ్డి. కానీ వీలు కాలేదు. దానితో ఈ అవ కాశం ఇవ్వాలని తలపెట్టాడు.

అయితే ఆయన కోరిక అంత సాఫీగా ఈడే టట్లు కన్పించడం లేదు. మొదటి సమస్య – గ్రామ స్థాయి సంఘాలలో తెలుగుదేశం పార్టీ అనుకొన్న దానికంటే అధికంగా గట్టి పోటీ ఇస్తుండడం. రెండ వది – చివరి నిముషంలో ముఖ్యమంత్రి అభ్యర్థిగా సుమంత్ రెడ్డి అనే నూనూగు మీసాల నవ యువ కుడు రంగప్రవేశం చేయడం.

సుమంత్ రెడ్డి విడవలూరు మండల ప్రాం తీయుడు. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డికి సన్నిహి తుడు. గతంలో జరిగిన కోవూరు శాసనసభ ఉప ఎన్నిక కోసం మొదటిసారిగా తెర మీదకు వచ్చాడు. కానీ అప్పుడది జరగలేదు. రాజకీయ ఆరంగేట్రం చేయాలన్న అభిలాషకు ఇప్పుడీ సహకార ఎన్నిక లను వేదికగా మార్చుకోవాలనుకొంటున్నాడు. ఈ పరిణామం ఆనం రామనారాయణరెడ్డిని బాగా ఇబ్బంది పెడుతున్నది. అయితే ఇప్పటివరకు ముఖ్య మంత్రి ఒక్క ఆదాల ప్రభాకర్‌రెడ్డితో తప్ప జిల్లాలో మరెవ్వరికీ తన మొగమాటం విప్పి చెప్పలేదు. ప్రాథ మిక దశలో గ్రామస్థాయి సంఘం ఎన్నికలు ముగి సిన తర్వాత చూసుకొందామనుకొన్నాడేమో తెలి యదు. మొత్తానికి సుమంత్ రంగ ప్రవేశంతో సహ కార ఎన్నికలకు వేడి పుట్టింది.

అటు కాంగ్రెస్ కుల పెద్ద నేదురుమల్లి, ఇటు తమ స్వంత ఇంటి పెద్ద వివేకానందరెడ్డి తోడు లేకుండా ఆనం రామనారాయణరెడ్డి నిర్వహించబో తున్న మొదటి ఎన్నిక ఇది. రామనారాయణకు ఏదీ పట్టదు, దేనికీ ఓర్పు వుండదనే అభిప్రాయం ఒకటి వుంది. తాను నిజంగా నేతను అని నిరూపించు కోవాలంటే ఈ ఎన్నికలో గెలవాలి. ప్రతిపక్షాల నుంచి పెద్దగా ప్రతిఘటన కూడా లేని ఎన్నిక కాబట్టి సమస్యలు తక్కువ. దీనిలో సఫలీకృతుడై తేనే జిల్లాలో కాంగ్రెస్ పెత్తనం ఆయన వద్ద నిలు స్తుంది. చూద్దాం – ఈ సవాలును ఎంత వరకు స్వీకరిస్తాడో.

## జనవాణి

2వ పేజీ కొరవ

వాటిస్థానే ఈ మధ్య డివిజన్‌కు ఐదారు ఇంజ నీరింగ్ కాలేజీలు వచ్చి వాటి బతుకు దుర్భరంగా తయారయ్యింది. ఇంజనీరింగ్ కాలేజీల నడత కష్ట మైన దృష్ట్యా ఈ కాలేజీల్లో మళ్లీ ఆర్ట్స్ అండ్ సైన్సు డిగ్రీ కాలేజీలకు తోడు ప్రత్యేక కోర్సుల నిర్వహణకు యాజమాన్యాల అనుమతులు తెచ్చుకోమనవి.

కె.సుజాత కావలి

## మనం మారాలి

సమాజంలో నైతిక విలువలు, సామాజిక స్పృహ నానాటికీ మృగ్యమై పోతున్నాయి. నేటితరం ధనార్జనే ధ్యేయంగా, కెరీర్‌ను ప్రాణప్రదంగా భావిస్తూ మానవతా విలువలు, ఆప్యాయతలు, కుటుంబ జీవన విధానాలకు తిలోదకాలు ఇస్తున్నారు. ఫలి తంగా సాటి మనిషి కష్టాలను అవసరాలను పట్టించు కునే పరిస్థితి లేదు. కేవలం తన కోసం బ్రతికే స్వార్థ పూరిత జీవన విధానాన్ని ఆధునిక మానవుడు అల వర్చుకొన్నాడు. ప్రతీ పనికి డబ్బుతో ముడి పెట్ట డంతో మానవ సంబంధాలన్నీ ఆర్థిక సంబంధా లుగా మారిపోతున్నాయి. సమాజంలో చైతన్యం రావాలంటే చిన్నతనం నుంచే సామాజిక స్పృహ, నైతిక విలువలు, ప్రేమలు, అనుబంధాలు పెం పొందించే విధంగా కృషి చేయాలి. మెదడును కాక హృదయాన్ని పవిత్ర పరిచే పాఠాలను కోర్సులలో చేర్చాలి.

ఎం.సుధాకర్ కోవూరు

## పదరంగం -52

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | | 3 | | 4 | | 5 | |
| | | | | 6 | | | | | 7 | |
| 8 | | | 9 | | | | | 10 | | |
| | | 11 | | | | | 12 | | | 13 |
| | 14 | | | 15 | 16 | | 17 | | 18 | |
| 19 | | | | 20 | | | | | 21 | |
| 22 | | | 23 | | 24 | | 25 | | | |
| 26 | | | 27 | | | | 28 | | | 29 |
| | | 30 | | | | | | | 31 | |
| 32 | | | | | 33 | 34 | | 35 | | |
| | | | | 36 | | | | 37 | | |

**అడ్డం**

1. నటన (4)
4. ఎండాకాలం (3)
6. ఆపర్చునిటీ (4)
7. కొమ్మ బ్రాంచి (2)
8. పాము పొనుపు (4)
10. నీరు (2)
11. అటునుంచి తల (2)
12. భీముని ఆయుధం (2)
15. రేయి (2)
17. పన్నాగము (4)
19. ఒంటెల.... జంతువుల షెడ్ (3)
20. అటునుంచి, నీటిపాయ జడ (2)
21. అటునుంచి, ఏనుగు (2)
22. సన్నం కాదు (2)
24. అటునుంచి వ్యాపారం వాణిజ్యం (3)
26. దేవాలయం (2)
27. నివసించే చోటు (3)
28. వాణి, మాట (2)
30. అటునుంచి బలుపు కాదు, వాతం (2)
31. గోదా, రంగం (2)
32. స్నేహితుడు (4)
33. అటునుంచి తడి (2)
35. కమ్మరిపొయ్యి (3)
36. సర్పాలు (3)
37. సమూహము (3)

**నిలువు**

1. మిగిలిపోయినది (4)
2. న్యూ జనరేషన్ (4)
3. గాలి (3)
4. లోబడి వుండడం (2)
5. ఇరుకు కాదు (3)
9. రాతిబొమ్మ క్రింద నుంచి (2)
10. ప్రపంచం (3)
12. క్రింద నుంచి వక్షము (2)
13. పానుపు (3)
14. తొందర, ఆర్భాటం (4)
15. రాజు భార్య (2)
16. మూడు నదులు కలిసే చోటు (7)
18. గడ్డి (3)
19. క్రింద నుంచి రోజా పువ్వు (3)
23. సేవకుడు (4)
25. తగవు (3)
29. తెలుగు లిమిట్ (4)
30. వదంతి (3)
31. బలం కలిగి వుండడం (3)
32. జైలు, బందీఖానా (2)
34. వృశ్చికం (2)
35. చివర, అంచు (2)

**సమాధానాలు**

## పదరంగం -51

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1మం | డూ | 2కం | | 3అ | 4వ | గా | 5హ | న | | 6వై |
| ది | | 7డూ | పు | | రూ | | రు | | 8గం | రా |
| 9రం | 10మి | తి | | 11అ | ధి | కు | డు | | 12మృ | గ్యం |
| | న్న | | | 13ప | ని | | | | | |
| 14కా | పు | 15రం | | కా | | | 16వా | 17మా | 18చా | 19రం |
| వ | | 20గు | డా | రం | | 21బ | హి | ర్గ | త | ము |
| 22రం | 23కా | ల | | | | | 24ని | శి | | గ |
| | 25ళి | రా | జ | 26మౌ | | 27కా | | 28రం | భ | |
| | 29క | ట్లం | | న | | 30కా | కి | | 31వి | ర |
| ప్పు | | | 32రా | ము | డు | | 33లి | 34ఖి | త | ము |
| 35అ | ను | జు | డు | | | 36అ | ప | స | వ్యం | గా |

# సంక్షిప్త సింహపురి

## ఎక్స్‌రే అవార్డు!

విజయవాడలోని ఎక్స్‌రే సాహిత్య సాంస్కృతిక సేవాసంస్థ ప్రతి ఏడాది నిర్వహించే కవితల పోటీల్లో 2012వ సంవత్సరానికి విజేతగా ఆదిలాబాద్ జిల్లా ఆవడంకు చెందిన తోకల రాజేశం కవిత 'అక్షరం' నిలిచిందని నిర్వాహకులు కొల్లూరి తెలిపారు. జిల్లాలోని కోట గ్రామానికి చెందిన కవి పెళ్లూరి సునీల్ వ్రాసిన మాయాబజార్ కవితకు ఉత్తమ కవితా పురస్కారం లభించిందన్నారు. 400లకు పైబడి వచ్చిన కవితలను ప్రముఖ సాహితీవేత్త డాక్టర్ ఏటుకూరి ప్రసాద్ పరిశీలించి విజేతలను ఎంపిక చేశారు.

## మురళీమోహన్‌రాజుకు యువజన అవార్డు!



యువజన సర్వీసుల శాఖ మరియు నెహ్రూ యువజన కేంద్రం ఆధ్వర్యంలో అంబేద్కర్ భవన్‌లో 12వతేదీ స్వామి వివేకానంద 150వ జయంతి వేడుక జరిగింది. ఈ సందర్భంగా సేవారంగంలో విశేషమైన కృషి చేసినందుకు ఇచ్చే బెస్ట్ యూత్ సర్వీసు అవార్డును బుజబుజ నెల్లూరు పినాకినీ యూత్ వెల్ఫేర్ అసోసియేషన్ అధ్యక్షుడు కె.మురళీమోహన్ రాజుకు ఐటిడిఏ ప్రాజెక్టు ఆఫీసర్ వెంకటేశ్వర్లు అందించారు. ఈ అవార్డు క్రింద పదివేలరూపాయల నగదు బహుమతి కూడా అందించారు. ఈ కార్యక్రమంలో యువజన సర్వీసులశాఖ ముఖ్యకార్య నిర్వహణాధికారి డాక్టర్ వి.కోటేశ్వరరావు, జిల్లా షెడ్యూల్ కులాలసేవా సహకార సంస్థ ఎగ్జిక్యూటివ్ డైరక్టర్ సోమయ్య పాల్గొన్నారు.

## భోగిమంటల్లో ప్రభుత్వ దిష్టిబొమ్మ!



దివంగత మహానేత వైఎస్ రాజశేఖర్ రెడ్డి రెక్కల కష్టంతో అధికారం అనుభవిస్తున్న కాంగ్రెస్ పార్టీ మహా నేత మరణం తర్వాత ఆయన ఆశయాలను తుంగలో తొక్కిందని, పన్నుల భారంతో, కరెంటు, సంక్షేమ పథకాల కోతలతో రాష్ట్ర ప్రజలకు శిరోభారంగా మారిందని వైకాపా నాయకుడు కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి విమర్శించారు. రూరల్ నియోజకవర్గ పరిధిలోని బట్వాడిపాళెం సెంటర్‌లో కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి ఆధ్వర్యంలో రూరల్ నియోజకవర్గ వైయస్ఆర్ కాంగ్రెస్ కార్యకర్తలు భోగిమంటవేసి ఆ మంటలలో కాంగ్రెస్ ప్రభుత్వ దిష్టి బొమ్మను దహనం చేశారు. ఈ సందర్భంగా శ్రీధర్‌రెడ్డి మాట్లాడుతూ భోగి పండుగనాడు పనికిరాని, ఉపయోగంలేని వస్తువులను భోగి మంటలలో వేయడం తెలుగు ప్రజల సాంప్రదాయమని అందుకే ఆ భోగి పండుగ ప్రారంభానికి కొన్ని గంటల ముందే ప్రజా భోగి మంటలను వెలిగించి ఆ భోగి మంటలలో ప్రజలకు పనికిరాని, రాష్ట్రానికి, దేశానికి చీడలా - పీడలా పట్టిన కాంగ్రెస్ ప్రభుత్వం దిష్టి బొమ్మలను దహనం చేస్తున్నామన్నారు. ఈ కార్యక్రమంలో కెవి రాఘవరెడ్డి, పిగిలం నరేష్‌యాదవ్, మందాబాజ్జీ, హసీనా, హజరత్ నాయుడు, బత్తల వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.

## సత్యహరిశ్చంద్ర నాటకకర్త నెల్లూరీయుడే!

నెల్లూరు సుబేదారుపేటలోని నగరపాలక ప్రాథమిక పాఠశాలలో కేతా అంకుల్ మెమోరియల్ ట్రస్ట్ నేతృత్వంలో సత్యహరిశ్చంద్ర నాటకంపై సమీక్ష జరిగింది. ఆర్వీ శేషయ్యనాయుడు, వేణుగోపాల్‌నాయుడు, బి.వి.నరసింహం, దుర్గం మధుసూదన్ చర్చలో పాల్గొని మాట్లాడారు. సత్యహరిశ్చంద్ర నాటకాన్ని నెల్లూరు జిల్లావాసి బలిజేపల్లి లక్ష్మీకాంతం కవి వ్రాయగా ఆంధ్రప్రదేశ్‌లోనే కాకుండా ప్రపంచమంతా కొన్ని లక్షలసార్లు ఎంతోమంది కళాకారులు ప్రదర్శించారన్నారు. ఆ నాటక ప్రదర్శన ద్వారా ఎంతోమంది కళాకారులు జీవిస్తున్నారన్నారు. ఈ సందర్భంగా సాయివెన్నెల ఆర్కెస్ట్రా నేతృత్వంలో పాటకచ్చేరి జరిగింది.

## ప్రకృతి నుండే క్యాన్సర్‌వ్యాధికి ఔషధాలు!




ప్రకృతిలో లభించే మొక్కలలోనికొన్ని రసాయనాల నుండి క్యాన్సర్ వ్యాధికి ఔషధాలు రూపొందించడం జరిగిందని ప్రముఖ శాస్త్రవేత్త, హైదరాబాద్‌లోని ఆవ్రా లేబరేటరీస్ ఛైర్మన్ మరియు మేనేజింగ్ డైరక్టర్ డాక్టర్ ఎ.వి.రామారావు పేర్కొన్నారు. హోటల్ శివం ఇంటర్నేషనల్ హోటల్‌లో ఇటీవల జరిగిన డాక్టర్ ఎల్లాప్రగడ సుబ్బారావు అవార్డు ప్రదానోత్సవ సభలో స్మారకోపన్యాసం చేశారు. క్యాన్సర్‌వ్యాధి వలన శరీరంలోని ఏ భాగంలోనైనా కణాల పెరుగుదల అసమర్థంగా జరుగుతుందని చెప్పారు. ప్రపంచంలో మొట్టమొదటిసారిగా క్యాన్సర్‌వ్యాధి గూర్చి ఈజిప్టు దేశంలో వివరించారని, తొలి క్యాన్సర్ ఆపరేషన్ క్రీస్తుపూర్వం 500లో జరిగిందన్నారు. తన పరిశోధన ద్వారా బిళ్లగన్నేరు (విన్‌కారోనియా) మొక్కలలో అల్కలాయిడ్ల నుండి మేథోట్రెక్సేట్ అనే ఔషధాన్ని రూపొందించడం జరిగిందన్నారు. ఫౌండేషన్ ఛైర్మన్ శాస్త్రవేత్త డాక్టర్ ఎ.జగదీష్ ఈ అవార్డు పూర్వాపరాలు తెల్పుతూ, ప్రపంచంలో ఏ ఒక్క శాస్త్రవేత్త డాక్టర్ ఎల్లాప్రగడ సుబ్బారావు రూపొందించినన్ని మందులు కనుగొనలేదన్నారు. డాక్టర్ వి.మధుసూదనశాస్త్రి, ఏపి పోలీస్ అకాడమీ జాయింట్ డైరక్టర్ ఇ.దామోదర్, డాక్టర్ ఎం.సుబ్రహ్మణ్యం ఈ సభలో పాల్గొన్నారు.



రైతు లోకం

# మిరపలో చీడ పీడలు - నివారణ!

ప్రస్తుతం మన జిల్లాలో మిరప పంట పూత దశ నుంచి కాయల దశ వరకు వున్నది. ఈ పంటలో ప్రధానంగా పై ముడత, క్రింద ముడత మరియు కానోఫోరా కొమ్మ కుళ్లు గమనించటమైనది. వీటి నివారణకు క్రింద తెలిపిన సూచనలు పాటించి నివారించుకోవచ్చు.

### పై ముడత

తామర పురుగులు ఆకుల అడుగు భాగాన చేరి రసాన్ని పీల్చటం వల్ల ఆకుల అంచులు పైకి ముడుచుకొంటాయి. ఆకులు, పిందెలు రాగి రంగులోకి మారి పూత, పిందె నిలిచిపోతుంది. దీని నివారణకు ఫిప్రోనిల్ 2 మిల్లీ లీటర్లు లేదా స్పైనోసాడ్ 0.3మిల్లీలీటర్ల చొప్పున లీటరు నీటికి కలిపి పిచికారీ చేసి నివారించవచ్చు.

### క్రింది ముడత

తెల్ల నల్లి పురుగులు ఆకుల రసాన్ని పీల్చటం వల్ల ఆకులు క్రిందికి ముడుచుకొని తిరగబడిన పడవ ఆకారంలో కనపడతాయి. ఆకుల కాడలు సాగి ముదురు ఆకుపచ్చగా మారుతాయి. మొక్కల పెరుగుదల ఆగిపోయి లేత ఆకులు ముద్దకడతాయి. దీని నివారణకు డైకోఫాల్ 5 మిల్లీలీటర్లు లేదా నీటిలో కరిగే గంధకం 3 గ్రాములు లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారీ చేసి నివారించవచ్చు. పై ముడత, క్రింది ముడత ఉధృతి ఒకేసారి గమనించినచో ఉధృతిని బట్టి ఫాసలోన్ 2 మిల్లీ లీటర్లు లేదా పెగాసస్ 1.5 గ్రా లేదా ఇంట్రిపిడ్ 2 మిల్లీలీటర్లు చొప్పున లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి.

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

### కానోఫోరా కొమ్మ కుళ్లు తెగులు

లేత చిగుళ్లు మాడిపోయి కొమ్మల కణుపుల వద్ద కుళ్లు కనపడి కొమ్మలు విరిగిపోతాయి. దీని నివారణకు కాపర్ ఆక్సీక్లోరైడ్ 30 గ్రాములు మరియు స్ట్రెప్టోసైక్లిన్ 1 గ్రాము 10 లీటర్ల నీటితో కలిపి వారం రోజుల వ్యవధితో రెండుసార్లు పిచికారీ చేయాలి.



